





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

## సంస్కృత నాటకము





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001332

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంస్కృత నాటకము

## (విక్రమోర్వశీయ పీఠిక)

రచన


**మహమ్మద్ అజీజ్ మిర్జా**

సంపాదకుడు

**ఖాజా మహమ్మద్ అహమద్**

కార్యదర్శి - పర్యవేక్షకుడు

అబ్దుల్ కలామ్ ఆజాద్ ఓరియంటల్ పరిశోధకసంస్థ

అనువాదము

**డా. కే. గోపాలకృష్ణారావు**

రీడరు

లుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.






ప్రచురణ

**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ**

# విజ్ఞప్తి

ఉర్దూ సాహిత్య పాఠకులకు సంస్కృత సాహిత్యముతో పరిచయము కలిగించు లక్ష్యముతో మహాకవి కాళిదాస విరచితమగు విక్రమోర్వశీయ సంస్కృత నాటకమును ఉర్దూ భాషలోనికనువదించిన మహమ్మద్ అజీజ్ మీర్జా గారు ప్రశంసార్హులు. ఒకవంక ఉన్నతాధికార బాధ్యతలు నిర్వహించుచూ వేరొకవంక సాహితీ సేవ చేయగలుగుట మిర్జాగారి విశిష్టత యని చెప్పవచ్చును. కేవలం అనువాదముతో సంతృప్తి చెందక వారు విక్రమోర్వశీయమునకు విపులము, విమర్శనాత్మకమగు పీఠిక వ్రాసి తమకు గల నాటకప్రక్రియాభినివేశము చెప్పక చెప్పినారు. ఈ విక్రమోర్వశీయ విమర్శ చదువువారికి మీర్జాగారి గంభీర విమర్శనా పాటవము స్పష్టముకాగలదు.

సంస్కృత నాటకమను నామాంతరముగల యీ విక్రమోర్వశీయ పీఠికను డా॥ కె.గోపాలకృష్ణారావుగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కోరికపైన తెనిగించినారు. వారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు.
13-10-1978

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# మున్నుడి

కాళిదాసు రచించిన సంస్కృత నాటకమునకు ఉర్దూ అనువాదమును చూడగనే సంతోషము కలిగినది. ఆశ్చర్యముకూడ.

ఆశ్చర్యము కల్గించు విషయ మేమన- పూర్వపు హైదరాబాదు రాష్ట్రము నందలి న్యాయమూర్తి మహమ్మద్ అజీజ్ మిర్జాగారు ఈ అనువాదమును 1907 సంవత్సరమున ప్రకటించిరి. దీనిని చూడ, మిర్జాగారు ఎంతయు శ్రద్ధాశక్తులతో అనువదించినట్లు స్పష్టమగును. దీనితోపాటు చక్కని పీఠికను సంతరించినారు. దీనిలో సంస్కృత నాటకస్వరూపము సమగ్రదృష్టితో పరిశీలింపబడినది. సాహిత్య ప్రక్రియలలో దృశ్యనాటకమునకు గల స్థానమును నిరూపించి దాని ప్రయోజన ప్రాధాన్యములను వివరించినారు. సంస్కృతనాటక ప్రక్రియ, దాని భేదములు - గ్రీకు నాటకముతో తులనాత్మక పరిశీలనము-సంస్కృతనాటకములోని వివిధాంశములు, వస్తువు-రసము-నాయకుడు, నాయిక- భాష మొదలగు అంశములను నిశిత దృష్టితో చర్చించిరి. మిర్జాగారు సంస్కృత నాటకమును గూర్చి ఎన్నియో గ్రంథములను పరిశీలించిరి. సంస్కృత విద్వాంసులు కొందరు మాత్రమే వీరి కృషికి సాటి రాగలరు.

ఈ పీఠిక 68 పుటలకు పరిమితము. ఉర్దూసాహిత్య ప్రపంచమున కిది అమూల్యమైన బహూకృతి. ఉర్దూపాఠకులకు సంస్కృత నాటకస్వరూపము దీని వలన స్పష్టమగును. విక్రమోర్వశీయమే కాదు తదితర సంస్కృత నాటకములను గూర్చియు, ఎన్నియో విశిష్టాంశములు దీనివలన గ్రహింపగలుగుదురు.

మౌలానా అజాద్ పరిశోధన సంస్థ ప్రశస్తమైన ఈ పీఠికను ప్రకటించుట ముదావహము.

ఆర్యేంద్రశర్మ
ఎం. ఏ. (అలహాబాదు)
డి.ఫిల్ (మ్యూనిచ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయ-
సంస్కృత శాఖాధ్యక్షులు (రిటైర్డు
ప్రిన్సిపాల్, డీన్-ఆర్ట్సు).

# ప్రస్తావన

ఉర్దూపై ప్రాచ్య పాశ్చాత్య భాషల ప్రభావ మమితము. సంస్కృతము నందలి విశిష్ట లక్షణము లేదే నొక రూపమున ఉర్దూపై తమ ప్రభావమును ప్రసరింప జేసినవి. గీర్వాణ పాశ్చాత్య సాహిత్యములలో నాటక మొక విశిష్ట ప్రక్రియ.

పాశ్చాత్య నాటకముతో ఉర్దూభాషాసాహిత్యజ్ఞులు సుపరిచితులు. కాని వారికి సంస్కృత నాటక స్వరూప స్వభావములతో అంతగా పరిచయము లేదు. సంస్కృత నాటకమునుగూర్చి సమగ్రముగ పరిశీలించినపుడే దానిప్రభావము ఉర్దూపై ఎంతవరకు ప్రసరించినదో గ్రహించుటకు అవకాశము లభించును.

నేటికి దాదాపు 65 ఏండ్లకు పూర్వము మహమ్మద్ అజీజ్ మిర్జాగారు కాళిదాసు నాటకము విక్రమోర్వశీయమును ఉర్దూభాషలోనికి అనువదించి సంస్కృత నాటకముపై విపులమైన పీఠికను కూడ సంతరించి ప్రకటించిరి. అవి రెండును నేడు సరిగా లభించుటలేదు.

మహమ్మద్ అజీజ్ మిర్జాగారి పుత్రులు నవాబ్ నయాదుజంగ్ బహద్దురు గారు ఈ గ్రంథప్రతిని అబ్దుల్‌కలామ్ ఆజాద్ పరిశోధక సంస్థ అధ్యక్షులు కీ. శే. ఎల్. ఎన్. గుప్తగారికి చూపియుండిరి. గుప్తగారు ఈ పీఠిక అమూల్యమైనదని, ఉర్దూవారికి అందించుటకును, సంస్థ పక్షమున మరల ఒకసారి ప్రకటించుటకు సంకల్పించిరి. వారి ప్రతిపాదనము నవాబ్‌మీర్ అక్బర్ అలీఖాన్ అధ్యక్షుల సమక్షమున కార్య నిర్వాహక సభ్యులకు తెలిపిరి. వారందరును దీనిని ప్రకటించుట కంగీకరించుట వలన ఈ గ్రంథమును మరల పాఠకులకు అందింపగలిగినాము.

ఈ సందర్భమున గ్రంథకర్త జీవిత విశేషములను సంగ్రహముగ నివేదించుట అవసరము. మహమ్మద్ మిర్జాగారు 1865లో ఢిల్లీలో జన్మించిరి. అలీగఢ్ కళాశాల స్థాపింపబడగనే వారు అందులో ప్రవేశించి బి. ఎ. డిగ్రీని పొందిరి. ఈ గౌరవమునొందిన మహమ్మదీయ ప్రముఖులలో వీరగ్రగణ్యులు. విద్యాభ్యాసము పూర్తిగావించి పూర్వపు హైదరాబాదు రాష్ట్రమునకు వచ్చి అసిస్టెంటు హోమ్ సెక్రటరీ, కోర్ట్ ఆఫ్ వార్డ్సు అధిపతి, హోమ్ సెక్రటరీ కలెక్టరు, హైకోర్టు న్యాయమూర్తి మొదలగు పదవుల నలంకరించి రాష్ట్రమునకు సేవ గావించిరి. వీరి జీవిత విశేషములు సైరుల్‌మునన్నిఫీన్ రెండవ భాగమున (పుట 264) (మహమ్మద్ యాహ్యాగారు బి. ఏ. కృతము – జామె మిల్లియా ప్రకటితము) వివరింపబడినది.

అహమ్మద్ మిర్జాగారికి విద్యావ్యాసంగ మభిమాన పాత్రము. తాము స్వయముగ గ్రంథరచనలో నాసక్తులగుటయే కాక ఇతరులనుకూడ అట్టి కార్య క్రమమున పాల్గొనుటకు ప్రోత్సహించు చుండిరి.

వీరు బహమనీ రాజ్యమునకు చెందిన ప్రముఖ మంత్రి మహమూద్ గావాన్‌నుగూర్చి "సీరతుల్ మహమూద్" అను పేర ఒక ప్రశస్తమైన గ్రంథమును రచించిరి. మహమూద్‌గవాన్ విద్వాంసుడు. విద్యలపట్ల వీరికి గౌరవ మధికము. ఈతడు నిర్మించిన విద్యాలయము, అంబరచుంబిహర్మ్యము నేటికిని పలువురి ప్రశంసల నందుకొను చున్నవి.

వీరు విద్యలను గూర్చిన వివిధ ప్రణాళికలపై ఆసక్తి వహించిరి. దాయరుత్ ఉల్ హారిఫ్– ఆసఫియా గ్రంథాలయము, మరియు హైదరాబాదునుండి ఎన్నియో గ్రంథములు ప్రకటింపబడినవి. వీరి శ్రద్ధాసక్తుల ఫలిత మిది. మౌలానా హిబ్లీ గారితో వీరికి ప్రగాఢ పరిచయము. వారివల్లనే వీరు ప్రాచ్య అరబీ గ్రంథమును రూపొందజేసిరి. బూక్ ఆఫ్ అను ప్రాచీన అరబీ గ్రంథమును వీరే ఉర్దూ భాషలోనికి అనువదింపజేసిరి. అజంతా గుహలలో చిత్రింపబడిన బుద్ధుని జీవిత విశేషము లీగ్రంథమున వివరింపబడినవని విద్వాంసుల అభిప్రాయము.

మిర్జాగారు హైదరాబాదులో నివసించిన కాలమున విద్యాసాంఘిక రంగమున ప్రముఖపాత్ర నిర్వహించిరి. ఉపకార వేతనమునొందిన అనంతరము అలీగఢ్ కళాశాల, ఉర్దూభాషాసేవ, ఇతర సాంఘిక కార్యక్రమములలో చివరి క్షణము వరకును పాల్గొనియుండిరి.

వీరు తమ పుత్రులను ఉన్నత విద్యావంతుల నొనర్చిరి. అహమ్మద్ మిర్జాగారు చీఫ్ ఇంజనీరుగా నుండిరి. నవాబ్ సయీద్ జంగ్ బహద్దరుగారు పూర్వపు హైదరాబాదు రాష్ట్రమున న్యాయశాఖ మంత్రిగను, సజ్జాద్ మిర్జా గారు విద్యాశాఖ కార్యదర్శిగను నుండిరి. మహమ్మద్ మిర్జాగారు జంతు శాస్త్ర రంగమున లబ్ధప్రతిష్ఠులై జర్మనీలో నివాసము నేర్పఱచికొనిరి. మహమ్మద్ హామిద్ మిర్జా ఇంకమ్‌టాక్సు కమిషనరుగా నున్నారు.

మహమ్మద్ మిర్జాగారి ఈ గ్రంథమును వారి చిత్రమును మా సంస్థకు బహూకరించినందుకు కృతజ్ఞతలు.

శ్రీ ఆర్యేంద్రశర్మగారు ఈ గ్రంథమునకు పరిచయమును వ్రాసిరి. అది ఈ గ్రంథమున ప్రకటింపబడుచున్నది.

-:o:-

(హైరుల్మ్ సన్నఫీన్-రెండవ భాగము - పుట 264 నుండి ఉద్ధృతము - దీనిలో ఉర్దూ విద్వాంసుల జీవితము, యుగ యుగములలో ఉర్దూ సాహిత్య వికాసము- అను అంశములు వివరింపబడినవి)

(మహమ్మద్ యాహియా - వకీలు - బి.ఎ.ఎల్.ఎల్.బి. కవిత్వ ఆలోచనలు - పాశ్చాత్య చరిత్ర - అను గ్రంథాను వాదకుడు. మక్తబె-జామె మిల్లియా-ఇస్లామియా-ఢిల్లీ ప్రచురణ:

జామె మిల్లియా ప్రెస్‌లో ముద్రితము.)

మోల్వీ అజీజ్ మీర్జా దహల్వీ క్రీ.శ. 1865లో జన్మించెను. గౌరవనీయులైన డాక్టరు సర్ సయ్యద్ అహమ్మద్‌ఖాన్ బహద్దురు అలీగఢ్‌లో ఎం.ఏ.ఓ. కళాశాల స్థాపించినపుడు పదేండ్ల వయసులో మీర్జా ఇతర విద్యార్థులతోపాటు చేరి పన్నెండేళ్లు విద్యాభ్యాస మొనర్చి ఆంగ్లసాహిత్యము - చరిత్రలో బి.ఎ. ఆనర్సు డిగ్రీని సంపాదించెను. అప్పటికి భారతదేశమునం దిట్టి డిగ్రీ పొందిన మొదటి మహమ్మదీయు డీతడే. ఉర్దూ సాహిత్య విమర్శనము అను అంశముపై మీర్జాగారికి విద్యార్థి దశనుండియే అభిరుచి మెండు. కాని విద్యాభ్యాసమువలన ఈ అంశముపై పూర్తిగ సమయమును వినియోగించుట కవకాశము లభించ లేదు.

కళాశాల వదలి మీర్జాగారు హైదరాబాదు ఉద్యోగవశమున వచ్చిరి. ఉద్యోగ ధర్మము మొదలగు బాధ్యతలను నిర్వహించుచు, తమకు అభిరుచిగల సాహిత్యవ్యాసంగమును వీడలేదు. నవాబు వికార్ ఉల్-ముల్క్ బహద్దురుగారి

అభిప్రాయము ప్రకారము మీర్జాగారు దక్షిణాపథమున గావించిన సేవలలో సాహిత్య వ్యాసంగమున కధిక ప్రాధాన్యము కలదు.

మీర్జాగారు హైదరాబాదు రాష్ట్రమున కొనర్చిన సేవ ముఖ్యమయినది. తొలి దశలో వారు సెక్రటేరియేట్ కార్యాలయములో రహస్యవిభాగమున నియమింపబడిరి. ప్రభుత్వ రహస్యములను వీరు చక్కగా కాపాడుచుండిరి. అత్యున్నత పదవులలో నున్న ఒకరిద్దరు ప్రముఖులకు తప్ప ఇతరుల కెవరికిని తెలియని రీతిలో వీరు తమ బాధ్యతలను నిర్వహించుచుండిరి తత్ఫలితముగా క్రీ.శ. 1891లో వీరు హోమ్‌శాఖకు కార్యదర్శిగా నియమితులైరి. కొంతకాలము వరకు వీరు కోర్టు ఆఫ్ వార్డ్సు కార్యాలయ బాధ్యతలనుకూడ నిర్వహించిరి. దీనికి సంబంధించిన ప్రతిఫలముగ వీరికి నెలకు మూడువందలు ఇచ్చినపుడు వీరు ఉదారదృష్టితో "అనాథుల ధనముతో నా ఉదరమును పోషించుకొనుట కిచ్చగింప"నని ఆ ధనమును గ్రహించుటకు నిరాకరించినారు. ఈ అదనపు బాధ్యతలకై ఎట్టి ప్రతిఫలము నాశించక కోర్టువారి పనిని చక్కగా నిర్వహించిరి.

క్రీ.శ. 1895 లో వీరు మొదటి రాష్ట్ర హోమ్ సెక్రటరీగా ఉన్నత పదవి నధిష్ఠించిరి. 1896 లో హోమ్ సెక్రటరీగా నియుక్తులైరి. ఇది అత్యంతబాధ్యతతో కూడినట్టిదియు ఉన్నతమైనట్టిదియునగు పదవి. రాష్ట్రపాలనలో ఏర్పాట్లలో అధికము వీరి ఆధీనమున నుండెను. మీర్జాగారికి ప్రతి శాఖయందును సంస్కరణలు తెచ్చుటకు వీలైనది, నవాబసర్ ఎకారుల్ ఉమ్రా ప్రధానమంత్రి వీరిని స్నేహభావమున జూచుచుండిరి. ప్రతిరంగమునందును వీరి సహాయము నొందుచుండిరి. ఈ కాలముననే వీరు తమకు వివిధ విద్యలయందుగల అభిరుచి ననుసరించి రచయితల కెందరికో సహాయ మొనర్చిరి. విశిష్టములైన ఆంగ్ల అరబీ గ్రంథముల అనువాదములు వీరి ప్రోత్సాహమున గావించబడినవి. "జ్యూరిస్ ప్రూడెన్సు" అను ప్రసిద్ధ గ్రంథము వీరి ఆధ్వర్యమున ఉర్దూలోనికి అనువదించబడినది. అనేక గ్రంధముల రచించుట యందును, అనువదించుట యందును వీరు గ్రంథకర్తల కెంతయు ప్రోత్సాహము నొసగిరి.

క్రీ.శ. 1902లో వీరు బీడ్ జిల్లా కలెక్టరుగా నియమింపబడిరి. ఈ పదవి వారికి క్రొత్త అయినను శ్రమించి తమ బాధ్యతలను సక్రమముగ నెరవేర్చిరి. అసంపూర్ణముగ మూలబడిన కార్యములను నిర్వహించిరి. పరిపాలనలో నేర్పును ప్రదర్శించిరి. బీడ్‌వంటి వెనుకబడిన ప్రాంతమున కలరా వంటి వ్యాధులు ప్రబలినపుడు వీరు నిర్విరామముగా కృషిచేసిరి. వీరి సేవకు ప్రజలు కృతజ్ఞతలను వెల్లడించిరి.

వీరి శ్రద్ధవలన బీదవారికి చక్కని సత్రములు గౌరవార్హులకు ఒక వసతిగృహము నిర్మింపబడినవి. పరిశ్రమలకు సంబంధించిన ఒక పాఠశాల నెలకొల్పబడినది. క్లబ్బు ఏర్పాటైనది గ్రంథాలయభవనమునకు పునాది వేసిరి. ఎందరికో విద్యాభ్యాసమునందు దాసక్తి కలిగి ఉన్నత విద్యాభ్యాసమునకై విద్యార్థులు అలీగఢ్ కళాశాలకు వెళ్ళిరి. క్రీ శ. 1905 లో వీరు నాందేడ్ కలెక్టరుగా వెళ్ళిరి. వారు అచట రెండున్నరమాసములు మాత్రమే యుండిరి. ఈ స్వల్ప కాలముననే వీరు మూలబడిన పనులను చక్కదిద్ది ప్రజాహితకార్యములలో పాల్గొనిరి. క్లబ్బును అభివృద్ధి నొందించిరి. పట్టణము నుండి స్టేషన్‌వరకు మంచి మార్కెటును అభివృద్ధిపఱచిరి. అచిరకాలముననే వారు ఉన్నత పదవిలో నియుక్తులై అక్కడినుండి వెడలిపోయిరి. 1906లో హైకోర్టు జడ్జిగానుండి ఏడాదివరకు ఆ కార్యమును నిర్వహించిరి. మరల హోమ్ సెక్రటరీ పదవినలంకరించిరి. న్యాయశాఖ విద్యాశాఖలలో ఎన్నియో సంస్కరణలు ప్రవేశపెట్టిరి. ఈ కాలముననే వీరు పాశ్చాత్యవిద్యల ప్రణాళికను మౌలానా షిబ్లీగారివలన రూపొందించినారు. ఆసఫయా గ్రంథాలయ కమిటీ, నిజాము క్లబ్బు ఎడ్యుకేషనల్ బోర్డు – దాయరతుల్ మారిఫు – మొదలగు వానికి సభ్యులుగను సంహాదారుగను అధ్యక్షులుగను ఉండిరి. ఈ సంస్థలన్నింటి యందును చురుకుగా పనిచేసిరి. ఫ్రెంచిభాషనుండి గ్రంథములను ఉర్దూభాషలోనికి అనువదింపజేసిరి. స్పేన్‌చరిత్ర అనువాదము వీరి ఆధ్వర్యమున జరిగినది. వీరి సొంత గ్రంథాలయము పెద్దది. క్రమము తప్పక నిరంతరము గ్రంథపఠన మొనర్చుట వీరి అలవాటు. నవాబు సికిందర్ నవాబ్ జంగ్ బిరుదాంచితులైన శ్రీ మెహదీ హసన్‌గారి

"ఆంగ్ల దేశయాత్ర" అను గ్రంథమును మీరు "గుల్‌గుష్తెఫరంగ్" అను పేర హృద్యముగ ఉర్దూభాషలోనికి అనువదించిరి. ఇది మూలమునే మరిపించు అను వారము. తదనంతరము సీరతుల్ మహమూదు అను గ్రంథమును రచించిరి. మరాఠీ సంస్కృత భాషలనభ్యసించి కాళిదాసు విక్రమోర్వశీయ నాటకమును ఉర్దూలో రసవంతముగ వనువదించిరి. క్రీ.శ. 1909 సెప్టెంబరులో ప్రభుత్వోద్యోగమునుండి విరమించి ఉపకార వేతనము నొందిరి. అలీగఢ్ వెళ్ళి అలీగఢ్ కళాశాల కార్యదర్శియగు నవాబు వికారులుల్‌ముల్క్ గారికి కుడిభుజమై నిలిచిరి. 1909 లో ముస్లింలీగు సంస్థకు కార్యదర్శి అయినందున లక్నో నగరమునకు నివాసము మార్చిరి. ఆ సంస్థకు కార్యదర్శిగా కష్టనష్టములకోర్చి జాతికిని దేశమునకు మీరు చేసిన సేవ త్యాగము, మన రాజకీయరంగమున సాటిలేనిది. ఈ దశ యందును గ్రంథరచనా వ్యాసంగము కొనసాగినది.

దయ, కరుణామూర్తిభవించిన వారు మీర్జాగారు. హైదరాబాదులో మూసీ వరద వచ్చినపుడు ఎంతయో శ్రమించి రోగగ్రస్తులైరి. మీరు మానవుల కొనర్చిన సేవను గమనించి బ్రిటీషు ప్రభుత్వము వారు ప్రథమ శ్రేణి కైసర్ హిందు బిళ్ళను 1908లో సమర్పించిరి.

ముస్లింలీగు మరియు అలీగఢ్ వ్యవహారములందు ను మీరు నిరంతరము నిమగ్నులై కృషిచేసినందున మీరి శరీరారోగ్యము క్షీణించినది. 1912 ఫిబ్రవరి 26 నాడు ఉదయము 11 గంటలకు వ్యాధిచే మరణించిరి. మీరు రచించిన "ఖియాలాత్ అజీజ్" వివిధ వ్యాసముల సంపుటి నవాబు విఖారులుముల్క్ గారి పీఠికతో ప్రకటింపబడినది. ఇదియు విక్రమోర్వశీయ కృతియు మీరి రచనలలో ప్రశస్తములైనవి.

o o o

ఆత్మప్రశంస జీవితానికి అవసరము. మానవుడు ఆదినుండి తన అందము, చందము, నడవడి, శీలము మున్నగు వానిని హృదయ పూర్వకముగ మెచ్చుకొనుట ఈ తత్త్వము వలన అలవడినదే. అతనికి అభీష్టమైనది మరియొకటి కలదు. అతనికి సంబంధించినది, అతని పేర నున్నది, అంతియేకాక అతని ప్రభావము లేక ప్రతిబింబము కనిపించునది-వానిపై ఆసక్తి ఎక్కువ- ఇటువంటి ఆత్మప్రశంస సంస్కృతిలోని ఒక అంశము, కనుకనే మత సిద్ధాంత ప్రతిపాదకులు దీనిని సమూలముగ ఛేదించుటకు లేదా తగ్గించుటకు ప్రయత్నించిరి. వివిధ తత్త్వముల ప్రయత్న మీ మార్గముననే సాగినది. పిల్లలను వారి మాటలలో సమాధాన పఱచునట్లు బుజ్జగించినట్లు మత ప్రచారకులు మానవులను సన్మార్గవర్తులజేయుటకు అతని వివిధ రూపములను స్పష్టముగా జూపుటయే ఉత్తమ పద్ధతి అని భావించిరి. మతములు వీనినే ఉత్తమోత్తమముమైన కథానికలనియు, తత్త్వము, దృష్టాంత పూర్వక బోధనము(హదీస్ తమిసీల్)అనియు సాహిత్యము వచనములో కథ-గాథ-నవల లనియు కవితలో దృశ్యకావ్యము లనియు వ్యవహరించినవి.

విశ్వమను విహారస్థలమున దృశ్యమానముకానిది ఏదియు లేదు. కాని కనపడిన వివిధ వస్తువుల ప్రభావము భిన్నముగా నుండును. కొన్నింటిలో అయస్కాంతము వంటి ఆకర్షణ శక్తి, మరి కొన్నింటిలో విలీన శక్తి కలదు. కొన్ని దృష్టిని బంధించును. మరి కొన్ని దానిని మరల్చును.

ఒక దృశ్యము కన్నులకు మిఱుమిట్లు గొలుపును. ఇంకొకటి వాతావరణమును ప్రకాశ మొనర్చును. కనుకనే మానవుని హృదయము వివిధ భావములకు రంగముగా రూపొందినది. వీనిలో కొన్ని భావములు శక్తిమంతములు

---

1. ఇస్లాము మతగ్రంథములోని సంభాషణాత్మక సన్నివేశములు దృష్టాంత పూర్వక గాథలు.

తొలగించినంత మాత్రమున పోవునవి కావు. వినోదించినంతమాత్రమున నిలుచునవి కావు. వీని వ్యక్తీకరణమును అది శక్తిమంతమైనచో కవిత్వము అని వ్యవహరింప వచ్చును. శక్తిమంతములైన ఈ భావములు మానవులలో సాధారణముగా నుండును. కాని ప్రతివానికిని వీని వ్యక్తీకరణముపై అధికారము కాని శక్తికాని ఉండదు. ఇది కవి మేధస్సు, లేఖిని చిత్రకారుని కుంచెలకు మాత్రమే సాధ్యమగును. వీరు తమ ఆలోచనలను అనుభూతులకు దర్పణముగా నొనర్చి వ్యక్తీకరింతురు. అవి పాఠకులకు తమ అనుభూతుల ప్రతిబింబములవలె తోచును వివిధకవితారీతుల తత్త్వమిదియే కాని నాటకము అన్నింటికి సారభూతమైనది. కవిత్వము యొక్క ఇతర భేదములు వివిధ భావముల వ్యక్తీకరణకు సంబంధించినవి.కాని దృశ్యకావ్యములో ఒకచోట వివిధ దశలకు వర్గములకు చెందిన మానవుల హృదయములోని స్థితిగతుల ప్రతిబింబములు కనపించును. అనుభూతుల కేంద్రము మానవ హృదయము. అనుభూతులకు ఈ కేంద్రము రంగములను ఉక్త దృశ్య కావ్యమున సార్థకమైనట్లు ఇతర కావ్య భేదములకు కాదు.

## భారతీయనాటకతత్త్వము-గ్రీకునాటకముతోడి సంబంధము

గ్రీకులు మానవ హృదయమును సూక్ష్మాతిసూక్ష్మముగా పరిశీలించినట్లుగా ఎవ్వరును చేయలేదు. ఈ విధముగ వారికి వివిధ విద్యల పరిశోధన పరిశీలనలో అగ్రస్థానము వైశిష్ట్యము లంభించినట్లే నాటక స్వరూప పరిశీలనమునందును వారికి అగ్రపీఠము లభించినది. సంభాషణాత్మకమైన శైలి ఇతర వచనరచనల సంప్రదాయము ప్రాచీన హైందవులలో ఇతర జాతీయులందువలె జాతరలు, రాసలీల,ఉత్సవముల రూపమున కనిపించును. వేదములు, బ్రాహ్మణములు, వేదాంతములు ప్రత్యేకముగా రామాయణమహాభారతములలో గనిపించు కొన్ని సంభాషణలు దృశ్యకావ్యమునకు పునాదులుగా నుండ జాలినవి. వీరును ఇతర విద్యలకు వలె దృశ్యకావ్య ఆవిర్భావమునకు సృష్టికర్త బ్రహ్మయే, ఆద్యుడని భావించిరి. అతిశయోక్తి రూపమున వర్ణించుటలో అసలు విషయము దృష్టికి అందదు. కాని జర్మను పరిశోధకుల నిరంతర మైనకృషి ఫలితముగ సంస్కృత

నాటకములలో గ్రీకు నాటకముల ఛాయలు గలవు అను అంశము వెల్లడియైనది. సికిందర్ ఆజమ్ సైన్యాధికారి జనరల్ సెల్యూకస్ భారతదేశ సరిహద్దు ప్రాంతమునందు గ్రీకుసామ్రాజ్యమును నెలకొలిపి యుండెను. అది నాలుగు శతాబ్దములవరకు శక్తిమంతమగు రాజ్యముగా వైభవముగ నలరారినది. దీనికి భారతీయ రాజ్యములతోడి సంబంధములు కొంతకాలము సుహృద్భావపూర్వకముగను మరికొంతకాలము స్పర్ధలతోడను నుండెను. సెల్యూకస్ తన కూతురును మగధ సామ్రాజ్యాధిపతి చంద్రగుప్తున కీయుటకు సందేహించలేదు. ఈ అంశముల వలన గ్రీకులకు, భారతీయులకు పరస్పర అవగాహనము, సంబంధములు ప్రగాఢమై యుండెనని భావింపవచ్చును. సెల్యూకస్మూలమున గాని చంద్రగుప్తుని రాజ్యసభలో రాకపోకలు అధికముగా నేర్పడిన కారణమున గాని బక్ట్రియాలో ప్రత్యేకముగా ప్రాచీన భారతీయులకు గ్రీకు నాటకముల దర్శించెడి అవకాశము లభించి యుండును. ఈ విధముగ భావించుటకు మరియొక కారణము బలవత్తరముగా తోచుచున్నది. భారతీయులలో నాటకవికాసము బుద్ధమత ప్రచారకులు విశ్వమున వ్యాపించి యున్నకాలమున జరిగినది. వీరి వలన ఆ కాలమున భారతీయులకు విజాతీయులతో ప్రగాఢ స్నేహసంబంధము లేర్పడియుండెను. ఈ అంశములను పరిశీలించినప్పుడు ఈ ఊహ సముచితముగా తోచుచున్నది, నాటకముయొక్క వికాసము ప్రప్రథమముగా అవంతి ఉజ్జయిని మరియు మాళ్వదర్బారులోనే జరిగినది. ఈ ప్రభువులకును బక్తర్ అధిపతులకును ప్రగాఢ సంబంధముండెను, సంస్కృతభాషలో తెరను యవనిక యని వ్యవహరింతురు. యవనులనగా సంస్కృతమున గ్రీకువారు. అనంతర దశలో యవనులను పదము ఇతర పాశ్చాత్యులకును వ్యవహరించిరి. భారతీయులలో మతదృష్టి బలీయమైనది. అది వారి భావనలు, ఆలోచనలలో ఒక భాగము కావి మతముద్రలేని విద్య కాని కళ కాని వారి వ్యవహారమున లేదనుట అతిశయోక్తి కాదు. దీనికి భిన్నముగ మతమునకు సంబంధములేని నాటకభేదము లెన్నియోకలవు. ఈ అంశమును ప్రాతిపదికగా గ్రహించినచో ఈ దృశ్యరూపకము అన్యదేశీయ మైనదను అంశము స్పష్టమగును.

## గ్రీకు, భారతదేశనాటకములకుగల భేదములు

ప్రాచీన భారతీయులు కేవలము గ్రీకు నాటకములలోని వినోదాత్మకములగు ప్రదర్శనలను మాత్రమే చూచి వారి నాటకముల వలన కొంతవరకు లాభమునొంది యుందురు, కాని గ్రీకు నాటక కళాస్వరూపమును మాత్రము భారతీయులు దర్శించలేదు. ఏలన అరిస్టాటిలు చూపిన త్రివిధములైన ఐక్యతలు[1] ద్వివిధములైన నాటకములు[2] 'గ్రీకు కోరసు'[3] అనునవి భారతీయ నాటకములో కనిపించవు. భారతీయులు నాటకమునకు సంబంధించిన సూక్ష్మాంశములను నిశిత పరిశీలనాత్మక దృష్టితో చిత్రించి రూపకకళకు గ్రీకులు ఊహించలేనంత స్థాయిని రూపొందించిరి. భారతీయుల విశిష్టకృషి ప్రశస్తమై వెలుగొందినది. దానిని దాదాపు వేయి సంవత్సరముల అనంతరమే పాశ్చాత్యులు గ్రహింపగలిగిరి. వివిధ దేశములకు ప్రాంతములకు సంబంధించిన దృశ్యములు ప్రదర్శించుట అసాధ్యమని భావించి తొలిదశలో గ్రీకువారు దేశకాలప్రాంతములకు సంబంధించిన ఐక్యతను గూర్చి నియమముల నేర్పరచిరి. దుఃఖాంత సుఖాంత నాటకములను వర్గీకరణము తత్త్వ దృష్టిలో సముచితమైనదే కాని నాటకము యొక్క ముఖ్యప్రయోజనము అనగా ప్రేక్షకులకు శ్రోతలకు వినోదములోపాటు నీతి బోధన మొనర్చుట అనుదానికి భిన్నమైనది.

---

1, అరిస్టాటిలు దృష్టిలో నాటకములకు మూడు అంశములు ప్రధానములు. కాలదేశ పాత్రముల ఐక్యతకు అన్ని నాటకములు ఒకే కాలమునకు. కథకు పరిమితమై యుండవలయును.

. గ్రీకు వారి నాటకములు రెండు విధములు. ఒకటి కష్టాంతము రెండవది సుఖాంతము. వీనినే విషాదాంత సుఖాంత నాటకములని అందురు.

3. కొందరు కలిసి పాడుకొనుట–కోరస్ అనబడును. ప్రధాన కథకు చెందిన ఇతర సామాన్య కథాంశములకు సంబంధమును కోరస్ వలన తెలుపుచుండిరి.

విషాదాంత నాటకములందు విచారము, కష్టము, దుఃఖము అను భావము లతో పూర్ణమైన దృశ్యములవలన ఒక విధమైన నీతి బోధనము జరుగవచ్చు. కాని వానివలన కలుగు ఆనందము మాత్రము స్వల్పమే. నాటకములోని పాత్ర లవలన వస్తువును వివరించుటకు సాధ్యము కాని దశలో కోరస్ అవసరమై యుండెను. కాని నాటకమునందీ విధానమునకు పరిష్కారము, మార్గాంతరము లభించిన తరువాత దీని అవసరమే లేకుండెను. గ్రీకుల కృషి ఈ రంగము నం దాద్యమైన దనుటకు ఎట్టి సందేహములేదు. అయినను భారతీయ నాటకము ఈస్కిలస్, సఫోక్లిస్-యురిపిడిస్ వలన ఎట్టి ప్రభావము నొందలేదు, అది షేక్స్పియర్, బెన్జాన్సన్ నాటకములలో కొంతవరకు పోలియున్నది. ఆనాటక విధాన కల్పనము దాదాపు వేయేండ్ల తరువాత జరిగినది.

## నాటక భేదము

భారతీయ నాటకము భరతమునితో ఆరంభమైనట్లు చరిత్రకారులమతము అది అంతకంటె ప్రాచీనమైన దనియు సృష్టికళాశేఖరుడగు నలువ దీనిని వేద ములనుండి గ్రహించి భరతునికి నేర్పెననియు కొందరి అభిప్రాయము. ఇతర విద్యల వలెనే ఇది వేదకాలమునుండి ఆరంభించకున్నను, దాని అవిర్భావదశ ఎట్లున్నను భారతీయుల మతదృక్పథము, ఆలోచనా విధానము మాత్రము దానికి మూలము వేదము అనియే నిర్ణయించినది. భారతీయుల నిశిత పరిశీలనాత్మక దృష్టి వలన ఈ కళను గూర్చి సూక్ష్మాతిసూక్ష్మాంశము లెన్నియో నిరూపించ బడినవి. వారికృషి నేటికిని ఆశ్చర్యమును గొలుపుచున్నది. వీరిదృష్టిలో కావ్యము ద్వివిధము. మొదటిది దృశ్యకావ్యము -దృశ్యయోగ్యమైనది. రెండవది శ్రవ్యకా వ్యము-శ్రవ్యమైనది. నాటకము రెండవ వర్గము నందును జేరును. దీనిని రూపకమ నియువ్యవహరించుచున్నారు. ఒక విధమైన సామాన్య ఉపరూపకమునుకూడ రూపకమని అందురు. రూపకములు మూడు విధములైనవి. నాట్యము నృత్యము -నృత్తము ఈ వినోదాలను 1 గంధర్వులు [1] అప్సరసలు దేవతల సమక్షమున

1. దేవలోకగాయకులు

ప్రదర్శించుచుండిరి. 3. శివుడు వీనిలో మరి రెండు భేదములను, తాండవము, లాస్యము అను వానిని జేర్చెను. ఈ అయిదింటిలో నాట్యమునకు మాత్రమే రూపకమను నిర్వచనము సార్థకము. ఇది సంభాషణాత్మకము దర్శనయోగ్యము. నృత్యము ప్రదర్శనయోగ్యము. గానముండదు. నృత్యము కేవలము నర్తన ప్రధానమైనది. తాండవలాస్యములు దీని భేదములే.

## రూపకభేదములు

రూపకములు దశవిధములు. వీనిలో నాద్యమైనది నాటకము. దృశ్యకావ్యములందు సమగ్రమును విశిష్టమునైన స్వరూపము కల దిదియే. నాటకములలోని ఇతివృత్తము పౌరాణికము-చారిత్రకము- కల్పితము- మిశ్రమము అనువానిలో నొకటియై యుండెను. ఒకానొక దైవము ధీరోదాత్తుడైన ప్రభువు అవతారపురుషుడు వీరిలో నొకడు నాయకుడుగా నుండును. వీరశ్శృంగారాదులలో నొక రసము ప్రధానముగా పోషింపబడును. ఇతివృత్తముసామాన్యమైనదియును మనోహరమైనట్టిదియునుండవలయును. బీజమునుండి వృక్షమువలె వస్తువు సహజముగాను, క్రమముగాను వికాసము నొందును. కథయొక్క కాలవ్యవధి కొన్ని దినములకు లేదా ఒక సంవత్సరమునకు మాత్రమే పరిమితమై యుండును. వస్తుపోషణ విధాన ముదాత్తమై హృద్యముగా నుండవలయును.దీనిలో సాధారణముగా అయిదు మొదలుగా పదివఱకు నంకములుండును. ఇట్టి లక్షణములు గల నాటకాలకు అభిజ్ఞాన శాకుంతలము ముద్రారాక్షసము వేణీసంహారము మొదలగునవి లక్ష్యములు.

రూపకములలో ప్రకరణమనునది మరియొక భేదము. ఇది నాటకమువంటిదే. కాని నాటకమునందువలె వస్తునాయకరసాదు లుదాత్తరీతిలో నుండవు. కథకల్పిత శృంగారము ప్రధానరసము. వస్తువెట్టిదైనను అమాత్య,విప్ర, వైశ్యులలో నొకడు కథానాయకుడుగాను, కులజ లేక వేశ్య నాయికగ నుండును.

---

1. దేవలోక వేశ్యలు
3. దేవేంద్ర పదవికి గల వైశిష్ట్య మిది.

మూడవ భేదము భాణము. ఇది ఏకాంకిక. ఒక పాత్రతో ఆకాశభాషితము క్తితో లేక వివరణ పద్ధతిలో కథాంశము వర్ణింపబడును.

వ్యాయోగము నాలుగవది. దీని ఇతివృత్తము యుద్ధ సంబంధి. స్త్రీ నిమిత్తము కానిది.

అయిదవ భేదము. సమవకారము. మూడంకములుగల ఈ రూపకములో దేవతల గాథ వర్ణితము.

ఆఱవది డిమము — వస్తువు పురాణ ప్రసిద్ధము.

ఏడవది ఈహా మృగము— ఇది ఒక అంశమునకు పరిమితమని కొందరి మతము.

ఎనిమిదవ భేదము. — దీనిని గూర్చిన వివరములు మూలగ్రంథమున లేవు ప్రయత్నించినను లభించలేదు,

తొమ్మిదవది వీథి — ఇది బాణము వంటి రూపకము కాని, దీనిలో రెండు అంకము లుండవచ్చును. సంభాషణలు సరసముగా చతురముగా నుండవలయును.

పదియవది ప్రహసనము — ఇది హాస్య అధిక్షేపప్రధాన మైనది.

## ఉపరూపక భేదములు

దశరూపకములకు ఉపరూపకములు పదునెనిమిది విధములు, వానిని గూర్చిన విశేషము లివి:

1. నాటిక — ఇది రెండు విధములు — ఒకటి నాటకమును బోలినది, మరి యొకటి ప్రకరణము. వీనికి గల భేదమొకటియే. నాటిక నాలుగు అంశములకే పరిమిత మై యుండును.

2. త్రోటకము — దీనిలో అయిదు నుండి తొమ్మిది వరకు అంశములుండ వలయును. దివ్యమానుష, సంబంధమగు కథ ఇతి వృత్తముగా నుండును. విక్రమోర్వశీయ మిట్టిది.

3. గోష్ఠి— ఒకే ఒక అంశము గలది. పది పన్నెండు పురుష పాత్ర లుండును. అయిదారు స్త్రీ పాత్ర లుండవచ్చును. శృంగార ప్రధానమైనది.

4. సట్టకము: అద్భుత కథావస్తువు గలది. ప్రాకృతభాషలో రచింపబడు ఉపరూపక భేద మిది.

5. నాట్యరాసకము; నృత్యగీతములతో పూర్ణమైనది. శృంగార రసాత్మకము.

6. ప్రస్థానము: నాట్యరాసకమువంటి రూపకమిది. నీచ పాత్ర గలది. నాయికా నాయకులు, దాసదాసీజనమునకు సంబంధించిన వారే. వీరికి తోడుగా నుండువారు అల్పులు, కులవిహీనులు.

7. ఉల్లాప్యము : ఇది ఏకాంకిత. పౌరాణికేతివృత్తము గలది. శృంగారము-అనురాగము-విలాసము-భోగలాలసత-దుఃఖము మొదలగు భావములతో పూర్ణమైనది.

8. కావ్యము : ఇది ఏకాంకిక. ఉదాత్త భావములు మధుర గీతికలతో పూర్ణము.

9. ప్రేంఖణము: యుద్ధ సన్నివేశములు ఒకే ఒక అంకమున చిత్రింప బడినట్టిది.

10. రాసకము: అయిదంకములు గలది. హాస్య ఆధిక్షేప ప్రధానమైన కథ. నాయకుడు ఉన్నత వంశజుడేకాని మూర్ఖుడు. కాని నాయిక చతుర.

11. సంలాపకము : నాయకుడు మతప్రచారకుని వంటివాడు. మతప్రధానము లగు అంశములు యుద్ధములు మొదలగు దృశ్యములిందు చిత్రింపబడును.

12. శ్రీగదితము: భాగ్యదేవత లక్ష్మీదేవికి ఇందు ప్రాధాన్యముండును. నాయిక ఆమెకు ప్రతీకయై యుండును. దీనిలో కొంత

భాగము గానయోగ్యముగను మరికొంతభాగము పఠన యోగ్యముగను నుండును.

13 శిల్పకము: నాలుగు అంకములు గలది. శ్మశాన రంగము, మంత్రము ఇంద్రజాలము మున్నగునవి ప్రధానముగ నిందు చిత్రింప బడును.

14. విలాసిక; ఏకాంకిక; వినోద హాస్య ధోరణిలో రచింపబడునది. శృంగార ప్రధానమైనది.

15. దుర్మల్లిక: నాలుగు అంకములు కలది. నాయకుడు ఆతని సహచరులు హాస్యపూర్ణముగ సంభాషణలు గావించునట్టిది.

16. ప్రకరిణి: నాటికలో చేర్చదగిన రూపకభేద మిది.

17. హల్లీసకము: నృత్యగాన ప్రధానమైనది. ఒక పురుషపాత్ర ఎనిమిది లేక పది స్త్రీ పాత్రలతో పూర్ణము.

18. భాణిక: ఈర్ష్య, అసూయలు హాస్యఆధిక్షేప ధోరణి ప్రధానమైనది.

భారతీయులు సూక్ష్మపరిశీలనాత్మక దృష్టితో ఉపరూపకములను స్వల్ప భేదములతో ఇన్ని విధముల వర్గీకరించిరి.కాని రెండే రెండు భేదములు ప్రధానము లనిపించును. ఒకటి ఉదాత్తమైనది, మరియొకటి అల్పమైనది. ఇతివృత్తము వస్తువిన్యాసము, వ్యక్తీకరణ విధానము మున్నగు అంశములతో తారతమ్యము కనిపించును. భారతదేశము ప్రాచీన కాలము దృశ్యకావ్యము బహుళ ప్రాచుర్యము నొందినట్లు ఈ అంశముల వలన స్పష్టమగుచున్నది.

## దృశ్యకావ్యమున వివిధాంగముల సంవిధానము ;

దృశ్యకావ్యమునందలి వివిధాంగముల సంవిదానక్రమము పరిశీలనార్హము. సాధారణముగా నాటకము స్తుతిరో నారంభమగును. ఇది సామాజికులకు ఆశీస్సు రూపమున నుండును. ఈస్తుతి నాందిగ వ్యవహరింపబడుచున్నది. సూత్రధారుడు

లేక ఒకానొక పాత్ర నాందీ శ్లోకములను పఠించును. నాంది అనంతరము ప్రస్తావన అను భాగమున నాటకకర్త పరిచయము ప్రశంసాత్మకముగ గావింప బడును. ఇది రెండు విధములు.

1. ప్రరోచనము 2. ఆముఖము.

ఆముఖము మూడు విధములు. వీని వివరణము ప్రస్తుత మనవసరము. ప్రస్తావన అనంతరము ప్రధాన కథ ఆరంభమగును. నేటి నాటకములందువలె ఒక్కొక్క అంకము, దృశ్యము, మున్నగునవి క్రమము ననుసరించి కూర్చ బడును. ఒక అంకమున వివిధ దృశ్యముల మధ్య వ్యవధానము చూపుట అనుచితము. సాధారణముగా వీనిని నివారించుటకు రెండు పద్ధతు లనుసరింపబడినవి. ఒకరు వ్యాఖ్యాతగా మరియొకరు దర్శకుడుగా నుండును. వ్యాఖ్యాత విష్కంభమున దర్శకుడు ప్రవేశమున వచ్చును. వ్యవధాన మేర్పడినపుడు వీరు రంగ స్థలముపై ప్రవేశించి వ్యవధానమునకు సంబంధించిన కారణములను నివేదించి ప్రేక్షకులకు వినోదమును, ఆహ్లాదమును కలిగించురీతిలో సంభాషణ గావింతురు. ఒక దృశ్యము పూర్తియైనపుడు దానిని ప్రకటించి అనంతరభాగమును వివరించుట ప్రవేశకము వలని ప్రయోజనము. విష్కంభము యొక్క ప్రయోజనములు ముఖ్యమైనవి. విష్కంభమున పూర్వాఽనంతర కథలకు సంబంధము కూర్చ బడును. దీని వలన మనోజ్ఞమును సమయోచితమును అగు వాక్చాతురిగల సంభాషణము సామాజికులకు వినోదము కూడ కలిగించబడునవి. అంకములలో ప్రథమాంకమును అంకముఖముగా వ్యవహరింతురు. ఇందు నాటకములోని ప్రధానకథ సూచింప బడును. తరువాతి అంకములలో ఇతివృత్తము క్రమముగా పోషింప బడును. భారతీయ రూపకములలో సాధారణముగా ఒకటినుండి పదివరకు అంకములుండును, స్తుతితో ఆరంభమైనట్లు మంగళవచనముతో పూర్తిఅగును. దీనిని భరతవాక్య మందురు.

## నాటకమునందలి ప్రధానాంశములు

వస్తువు ననుసరించి నాటకమున మూడు ప్రధానాంశములు కనిపించును.

1. వస్తువు - ఇతివృత్తము లేక కథ.

2. నాయకుడు.

3. రసము.

వస్తువు రెండు విధములు. - ఒకటి ఆధికారికము రెండవది ప్రాసంగికము. నాయికానాయకులు, ఇతరులకు సంబంధించినది ఆధికారికము. దీనివలన వస్తువు పోషింపబడును. ప్రాసంగికము రెండువిధములు, 1. పతాక. 2. ప్రకరి. అనగా వస్తువును వివరించునట్టిది లేదా పోషించునట్టి సన్నివేశము. ప్రకరిలో నాటకము లోని ప్రధాన పాత్రలకెట్టి ప్రాధాన్యము ఉండదు. ఇవికాక మరి కొన్ని అంశములు ఇతివృత్తమును విస్తరింపజేయుట కవసరము. ఇవి మూడు విధములైనవి.

1. బీజము. 2. బిందువు. 3. కార్యము

బీజము కథకు పునాది వంటిది. దీనినుండియే శాఖోపశాఖలుగ కథ విస్తరిల్లును. వస్తువికాసమున కంతరాయ మేర్పడినపుడు ఇతర కథాసందర్భమును నంతరించి, దానిని తొలగించుటకు తోడ్పడునది బిందువు. కార్యము ఇతివృత్తమునకు ఫలదశ. దీనితో కథ పూర్తియగును. ఈ మూడు అంశములు నాటక పరిభాషలో అర్థప్రకృతు లనబడును. ఇతి వృత్తమును పరిపూర్ణముగా పోషించుటకు అయిదు దశ లవసరము. ఇవి అవస్థలనబడును. వీని వివరణ మిది :-

1. ఆరంభము - కథ ఆరంభదశ.

2. యత్నము - వస్తువికాసము.

3. ప్రాప్త్యాశ - ఫలదశనొందుటకుగల ఆశ - ఫలాశ.

4. నియతాప్తి - ఆటంకముల నధిగమించి ఫలము లభించునను విశ్వాసము.

5. ఫలాగమము - ఫలప్రాప్తి

ఇవి నాటకము యొక్క ప్రధానాంశములు.

వీనిపోషణము నిమిత్తమై కథాసంవిధానార్థము మరికొన్ని సంధాన ప్రక్రియ లవసరము అర్థప్రకృతులవలె ఇవి కూడ అయిదు కలవు. వీనిని పంచసంధులు అందురు.

1. ముఖసంధి - ఇది బీజము నారంభముతో సంధానించును. విక్రమోర్వశీయమున అప్సరసలు కుబేరుని సభకు వచ్చు సందర్భమున కేశి ఊర్వశి నపహరించుట, పురూరవు డామెను విడిపించుట అను కథాంశము లిందులకు ఉదాహరణము.

2. ప్రతిముఖసంధి:- ఇదియత్నముతో సంబంధించినది. వీనివలన బీజము నుండి అంకురము వెలువడును. విక్రమోర్వశీయమున ఊర్వశి రాజును ఉద్యాన వనమున కలిసికొనుట, అతనితో సంభాషించుటకు పూర్వమే ఇంద్రుని సన్నిధి కేగుటకు పరిస్థితు లేర్పడుట - అను కథా సందర్భములు దీనికి తార్కాణములు.

3. గర్భసంధి;- ఇచట ఇతివృత్తవికాసమునకు కొన్ని ఆటంకము లేర్పడునట్లు తోచును. కాని ఫలప్రాప్తికి తోడ్పడు సన్నివేశములు. విక్రమోర్వశీయమునందు ఊర్వశి ఇంద్రునిసభలో పురుషోత్తముని నామము నుచ్చరించుటకు బదులుగా పరధ్యానమున పురూరవుని పేర్కొనుట - భరతుడు విచారమునొంది శపించుట అను సన్నివేశములు దీనికి ఉదాహరణములు.

4. అవమర్శ సంధి :- అనుకున్నదానికంటె భిన్నముగా జరుగుట, కథ అడ్డము తిరిగినట్లు తోచుట అను అవస్థ అవమర్శసంధిలో కనిపించును. విక్రమోర్వశీయమున ఊర్వశి శిలగా మారిన సన్నివేశ మిట్టిది.

5. నిర్వహణసంధి;- సమస్తాంశము లేకముఖమై ధ్యేయమునందు కొను స్థితి.

భారతీయ విమర్శకులు సూక్ష్మదృష్టితో పరిశీలించి వీనిలో ప్రతిఅంశమునకు మరికొన్ని ఉపవర్గములను చూపిరి. వీనివి అంగములందురు. ఇవి అసంఖ్యాకములు. వీనివి ప్రత్యేకముగా వివరించుట ఇతరులకు సాధ్యముకానిది అని

విల్సన్ పండితుడు వచించెను. వీని పరిమితులు నిరూపించుటయు కష్టమే. ప్రాచీన భారతీయాలంకారికులు ఈసంధ్యంగములను 64 విధములుగా నిర్ణయించిరి. వీనిలో ముఖసంధివి 12 అంగములు. అవి ముఖాంగము లనబడును. మఱి పన్నెండు విధములు ప్రతిముఖ అంగములు. ఈ విధముగా మూడవ, నాలుగవ వానికి పదుమూడు, పదునాలుగు అంగములు కలవు. అయిదవదానికి 14 విధములు. ఇవి గర్భాంగ, అవమర్శాంగ, నిర్వహణాంగములుగా పేర్కొనబడినవి. ఇట ఒక్కొక్కదానికి ఒక్కొక్క ఉదాహరణమును మాత్రమే స్థాలీపులాక న్యాయమున చూపుట చాలునని తోచును.

యుక్తి:- ముఖాంగములలోని ఒక భేదము. ధ్యేయమును ఫలముతో సంధానించునట్టిది. పురూరవుడు ఊర్వశిని కేశిబంధములనుండి విముక్తనొనర్చుట దీనికి ఉదాహరణము. పురూరవు డీమెను ప్రేమించుట, ఆమెను కలసికొనుట- ఆలింగనమొనర్చుట-అనునవి వీనివలన ప్రయోజనములు.

పరిసర్పము:- ప్రతిముఖాంగములోని ఒక భేదము.ఇది ఇతివృత్తవికాస స్థితిని సూచించును. రెండవ అంకములో ఊర్వశి స్వయముగా పురూరవుని కలసికొనుటకు వచ్చుట, ప్రణయలేఖ రూపమున అనురాగమును వ్యక్తీకరించుట- దీనికి ఉదాహరణము.

అభూతాహరణము:- గర్భాంశములోని ఒక విధము ఛద్మము. మోసపు కార్యము- అనగా సన్నివేశము. ఇతరులకు అపార్థము కలుగునట్లుగనుండు స్థితి. రుస్తుము చనిపోయినట్లు ఎవరో తెలుపుట, కాని రుస్తుము పేరుగల వ్యక్తి చనిపోలేదనియు ఆపేరిట గుర్రము మరణించెననియు స్పష్టమొనర్చిన ఉదంతము దీనికి ఉదాహరణము.

ద్యుతి:-అవమర్శాంగములోని విధ మిది. దీనిలో యుద్ధప్రసక్తి రావచ్చును రుస్తుము సొహరాబునకు యుద్ధ సందేశ మొసగుట దీనికి లక్ష్యము.

గ్రథనము- నిర్వహణాంగములోని విధమిది—మొదటనుండి చివరిస్థితి వరకును ఒకానొక అంశమును సరిగా కూర్చుట-విక్రమోర్వశీయమున ప్రేయసీ ప్రియులు వియోగము నొందుట, అంతియేకాక సన్నివేశములను సంపూర్ణముగా వివరించుటకు కొన్ని అంశములు సూచ్యప్రాయముగా నొనర్చుట అవసరము.

ఇవి అయిదు విధములు:-

1-విష్కంభము:- సంధానించుట అని అర్థము. ఇది రెండు సన్నివేశముల మధ్య వచ్చును. పూర్వకథకును అనంతరకథకును సంబంధమును కలుగ చేయునట్లు మధ్యమ పాత్రల ముఖమున సంభాషణము సాగును. విక్రమోర్వశీయమున తృతీయాంక ఆరంభమున గాలవ పేలవులు, అను వారి సంభాషణమిందుల కుదాహరణము, ఇది కూడా రెండు విధములు. శుద్ధము- మిశ్రము అవి. శుద్ధవిష్కంభమున మధ్యమ పాత్రలు మిశ్రవిష్కంభమున మధ్యమ అధమపాత్రలు ప్రవేశింతురు. విక్రమోర్వశీయమున భరతుని శిష్యులలో ఒకరు మధ్యమ పాత్ర-ఇంకొకరు అధమపాత్ర.

2-చూళిక:—తెరవెనుకనుండి నేపథ్య పాత్రల వలన ప్రత్యేకమైన కథాంశము సూచింపబడునది.

3-అంకాస్యము:- ఒక అంకము చివరనే తరువాతి అంకము కథా సూచన ముండును. ఈ విధానము రెండు అంకముల కథకు పరస్పర సంబంధమును స్పష్ట మొనర్చును.

4-అంకావతారము;- ఒక అంకము చివర సూచింపబడిన కథాంశములలో తరువాతి అంకము ఆరంభమగునట్టిది.

5- ప్రవేశకము:-రెండు అంకములకు మధ్య నీచ పాత్రల వలన విష్కంభము నందువలె ప్రస్తుత లేక భావికథ ప్రసక్తి గావించబడును. దీనివలన కథయొక్క పూర్వాపరసంబంధము స్పష్టమగును. ఇవికాక మరియొక భేదము ఆకాశభాషితము అనునది కలదు. చాటుననుండి వినిపించు మాటలతో గావించ

బడు సంభాషణ మిది విక్రమోర్వశీయమున నాలుగవ అంకమునందు వీనిని చూడనగును. పురూరవుడు వియోగశిలను చూచి దానిని గ్రహించుటకు సందేహించు సమయమున ఆకాశవాణి దానిని తీసికొనుట కుపదేశించిన సందర్భ మిద్దది.

## నాయకుడు:-

నాటకమునందలి వివిధాంగములను వివరించిన అనంతరము పాత్రల గూర్చి పరిశీలించుట అవసరము. నాటక పాత్రలలో నాయకునకు విశిష్టమైన స్థానము కలదు. భారతీయనాటకము నానావిధము. తదనుగుణముగ ప్రతి వర్గము స్థాయికి చెందిన వ్యక్తులు నాటకమున పాత్రలుగా నుండ వచ్చును. దివ్యఅవతార, మానవ వర్గములవారు లేక చరిత్ర పురాణ, ప్రాచీన గాథలకు చెందినవ్యక్తులు మున్నగువారు నాటకమునందు ప్రధాన పాత్ర వహించ వచ్చును.

భారతీయ నాటకము బహుళముగ శృంగారప్రధానమైనది. కనుక నాయికా నాయకులు శృంగారరస పోషణమున కనుగుణమైన లక్షణములతో భూషితులై యుండవలయును. లజ్జ, నీతి, సౌందర్యము, యౌవనము, అనురాగము. అభిమానము ఔదార్యము సాహసము కులీనత మున్నగునవి వీని లక్షణములు. శాస్త్రమున నాయకులు చతుర్విధనాయకులుగా చిత్రింపబడిరి.

1. ధీరలలితుడు- ఈతడు సుఖాసక్తుడు, నిశ్చింతుడు, సరసుడు.

2. ధీరశాంతుడు- సచ్ఛీలుడు. గుణసంపన్నుడు. సత్యశౌచములు గలవాడు.

3. ధీరోదాత్తుడు- ఈతడు నిశ్చలుడు, ధీరగంభీరుడు.

4. ధీరోద్ధతుడు- వీరుడు, సాహసధైర్యసంపన్నుడు.

ఈ వర్గీకరణమునందును ఉపవర్గములు చేర్చి వానిని 48విధములుగా ఆలంకారికులు పేర్కొని పరిశీలించిరి. దేవమానవ అవతార పురుషులలో ఎవ రైనను నాయకులు కావచ్చును.

ఇట్లు పరిశీలించ నాయకభేదములను 144వరకు గణింపవచ్చును. ఇన్ని వర్గములను వాని లక్షణములను వివరించినచో పాఠకులు తబ్బిబ్బునొందవచ్చును. కనుక విక్రమోర్వశీయము నందలి ధీరోదాత్తనాయకుడు పురూరవుని,దృష్టి యందిడుకొని ప్రస్తుతము ధీరోదాత్తుని లక్షణములను మాత్రమే వివరింతును.

1. దక్షిణుడు— భార్య ఒకతె యున్నను అన్యాంగనలపై ఆసక్తమైన హృదయము కలవాడు.

2. శఠుడు— చతురుడు. ఒక నాయికయం దనురక్తుడయ్యు ఆమె కప్రియము కలిగించి అన్యస్త్రీలతో ప్రణయమును రహస్యముగా కొనసాగించును.

3. ధృష్టుడు. స్వేచ్ఛగా అన్యాంగనలతో ప్రణయ వ్యవహార మొనర్చువాడు సిగ్గునొందనివాడు.

4 అనుకూలుడు— స్వకాంతయం దనురక్తుడై యుండువాడు. ధీరోదాత్తునకు ఎనిమిది విధములైన పౌరుషగుణములు కలవు. సౌందర్యము, రసికత, ఔదార్యము, దూరదృష్టి, విశాలదృష్టి, ధైర్యము, గాంభీర్యము, శాంతము కార్యదీక్ష అను గుణములు.

## నాయకసహాయకులు-

నాయకుని అనుచరులలో అగ్రస్థానము వహించువాడు పీఠమర్దుడు. ఈతనిపై పతాక—అవాంతర కథ ఆధారపడియుండును, వాచాలుడు, నాయకునకు విధేయుడు నాయకునకు తరువాతి స్థాయిలో నుండువాడు. పీఠమర్దుని అనంతరము విదూషకునకు ప్రత్యేకస్థానము కలదు. ఈతడు నాయకునకు ప్రాణసఖుడు.చెలికాడు. వికాడంబరుడు హాస్యప్రియుడు. నాయకునకు హృదయోల్లాసమును గలిగించును. ప్రణయ వ్యవహారమున ఆతనికి సహాయమొనర్చును. విదూషకునితో సమాన స్థాయిగలవాడు విటుడు. ఈతడు కవిత్వము గేయము—వివిధ కళలలో ప్రవీణుడు అవసరము కలిగినచో ప్రాణస్నేహితుని వలె కార్యములను సాధించును. వీరేకాక అధికారులు—మంత్రులు— పురోహితులు— ఋషులు— సేవకులు— వేత్రహస్తులు—

ద్వారపాలకులు— యవనులు. మొదలగువారు వివిధ పాత్రలు ధరింతురు. కొన్ని సందర్భములలో నాయకునకు ప్రతి స్పర్ధుడుగ ప్రతి నాయకుడు చిత్రింప బడును. ఇత డీర్ష్యాపరుడు. ధీరుడు, అయినను దుర్నీతిపరుడు. రామునకు ప్రతిగ రావణుడు ప్రతి నాయకుడు.

## నాయిక

భారతీయాలంకారికులు విమర్శనాత్మకదృష్టితో నాయకుని భేదములను వారి లక్షణములను నిర్దేశించినట్లే నాయికా భేదములను లక్షణములను స్పష్టముగా నిరూపించిరి. దేవి, అప్సరస, అవతారపురుషునిసతి, ఋషిపత్ని, గోపిక లేక కల్పిత గాథలలో రాజకొమరిత. వేశ్య, రమణి అంతఃపురస్త్రీ వీరిలో నెవరినైనను నాయికగా గ్రహింపవచ్చును.

మొదటి వర్గమునకు చెందిననాయిక కల్పిత నాయిక— లేక పురాణములో చిత్రింపబడిన పాత్ర. మిగిలినవారు సమకాలిక వ్యవస్థ ననుసరించి చిత్రింప బడినవారు.

నాయిక మూడు విధములు—

1. స్వీయ 2. పరకీయ 3. సామాన్య.

స్వీయ నాయకుని సతి— రాముని ధర్మపత్ని సీత దీనికి ఉదాహరణము.
పరకీయ. అన్యోఢ లేక కన్య
సామాన్య— వారసులులేని స్త్రీ.

పరకీయ ఇతరులతో సతిగా సంబంధము కలిగి యుండవచ్చును. వివాహిత స్త్రీల తోడి ప్రణయము, వారిని వశీకరించు కథలు భారతీయ నాటకములలో పరిహ

---

1 నాయిక అనగా వెలది. వేశ్య అనియు అర్థము గలవు. ఈ పదమునకు గల నానార్థములను పరిశీలించినపుడు శబ్దార్థ మెంతదూరము పయనించినదని ఆశ్చర్యము కలుగును.

రింపబడుట ప్రస్తుతింపదగినది. ఇట్టివి పాశ్చాత్య నాటకములలో అధికము. నాయికను మరికొన్ని లక్షణముల ననుసరించి ముగ్ధ, ప్రౌఢ లేక ప్రగల్భ అనియు వర్గీకరించిరి. వీరిలో వర్గములు, ఉపవర్గము లెన్నియో కలవు. ప్రవృత్తి అవస్థాభేదముల ననుసరించి నాయికలను అష్టవిధనాయికలుగా విట్లు విరూపించిరి.

1. స్వాధీనపతిక - భర్తను అనుకూలవతియైన సతి.

2. వాసకసజ్జిక - వస్త్రాలంకార భూషితయై ప్రియునికై నిరీక్షించు నాయిక.

3. విరహోత్కంఠిత - ప్రియుని విరహమున విషణ్ణహృదయ యగునాయిక.

4. ఖండిత - కాంతు డన్యాంగనా సక్తుడైనట్లు విని ఈర్ష్య నొందిన నాయిక.

5. కలహాంతరిత - ప్రియునితో కలహించి విడనాడి, తరువాత తాపమునొందు నాయిక.

6. విప్రలబ్ధ - ప్రియుడు వాగ్దాన మొనర్చి మాట తప్పినపుడు వికల మానస యగునది.

7. ప్రోషితభర్తృక - ప్రియుడు లేక భర్త పరదేశమున నున్న నాయిక.

8. ప్రియుని లేక కాంతుని రప్పించు కొనునది లేక అతని కడకు పోవునది.

అవస్థా భేదముగల నాయికలు వీరు. ఇక నాటక వధువు నలంకరించుటకు భారతీయాలంకారికులు కూర్చిన గుణ భూషణములు పరిశీలనార్హము- వారి దృష్టిలో ఈ గుణముల సంఖ్య దాదాపు ఇరువది. వీనిని అలంకారములని వ్యవహరించిరి. వీనిలో బహుళములు ప్రసిద్ధములు. సౌందర్యము, యౌవనము, సౌశీల్యము, వినయము మొదలగునవి. వీనితో కొన్ని భారతీయ నాటకములలో మాత్రమే విశిష్టమైనవి. ఇవి గమనింపదగినవి.

భావము- హృదయమున కలుగు వికారము, దాని వ్యక్తీకరణము.

హావము- భావములను శక్తి మంతముగా వ్యక్తీకరించుట, ముఖ వర్ణము మారుట మొదలగునవి.

హేల— సమగ్ర రీతిలో భావ వ్యక్తీకరణము.

లీల— ప్రియుని వాక్కు, వేషము, చేష్టలు,— వర్తనవిధానము మొదలగు వారు. తనకు లేదా సఖులకు హృదయోల్లాసము కూర్చుటకై అనుకరించుట,

విలాసము—భోగాసక్తి

విచ్ఛిత్తి—తిరస్కృత దశలో వస్త్రాలంకారముల ధారణము పట్ల వైముఖ్యము.

విభ్రమము —మానసిక ఆందోళనము. లేక సంభ్రమము వలన భూషణాదులను తారుమారుగా దూనుట. కర్ణాభరణమును నాసికయందు కాని, కంఠాభరణమును పాదములందుకాని, అలంకరించు కొనుట ఇట్టిది.

కిలికించితము— పరస్పర విరుద్ధములైన భావముల సంకరము భయము, వినయము మానము—బాష్పము; కోపము—ప్రహర్షము—

మోట్టాయితము— ప్రియునకు సమాధానముగా మౌన రూపమున అనురాగమును వ్యక్తీకరించుట.

కుట్టమితము— ప్రియునిపైగల ప్రేమను తిరస్కరించినట్లు నటించుట.

విహృతము— హృదయగతభావములను లజ్జచే వ్యక్తము చేయక దాచుట.

లలితము— సౌందర్యగర్వము, సంయోగసుఖమునొందిన స్థితి. తత్ఫలితముగా ముఖమునం దానందపారవశ్యము కనిపించుట— సువస్త్రధారణము.

## నాయికల సహకారిణులు

నాయిక హృదయాగత భావములను రహస్యములను తెలుపుటకై ఈమెకు తోడుగా చెలికత్తె అవసరము. ఆమె సామాన్య నాయిక అయినచో ఈ కార్యము సవతి సోదరి లేక ఒకానొక సఖి చేయును. ఆమె రాణియైనచో ఈ పని సాధారణముగా దాసిచే నిర్వహింపబడును. వీరేకాక గోపికలు మున్నగువారు సందర్భము ననుసరించి రంగస్థలముపై ప్రవేశింతురు.

నాటక స్వరూపము నాటకాంగములు మున్నగు వానిని పరిశీలించిన అనంతరము దాని ప్రయోజనములను గమనించుట సముంజసముగా తోచును. ఈ సందర్భమున మౌలానా రూమ్ అభిప్రాయము గమనింపదగినది. వినోదోల్లాసముల మూలమున హితోపదేశ మొనర్చుట సముచితమనియు నట్టి ప్రయోజనమును సరస సంభాషణముద్వారా సాధింపవచ్చుననియు ఈ విధానముచే ప్రేక్షకుల హృదయముపై ప్రగాఢ ముద్ర కలిగించవచ్చుననియు వారు వచించియుండిరి. ఈ ప్రభావమునే భారతీయాలంకారికులు రసముగా వ్యవహరించిరి.

## రస నిర్వచనము

రసమనగా రుచి లేక ఆనందము, కాని దీనిని ఒక్క మాటలో చెప్పకున్నను విశిష్ట భావము అని వ్యవహరింపవచ్చును. దీనిలో సామాజికులు లేక శ్రోతల హృదయములను ప్రభావిత మొనర్చు ప్రత్యేకశక్తి దేనియందున్నను అది ఇట్టిదే. సాధారణముగా కారణము కంటె కార్యమునకే ఈ పదము నన్వయింతురు.

ఈ శక్తివి ప్రభావమును కలిగించునది భావము. ఒకానొక దృశ్యమును చూచినపుడు సుఖదుఃఖములకు సంబంధించిన ఒకానొక అవస్థ హృదయముపై ప్రగాఢ ముద్రవేయుదానిని భావము అని నిర్వచింపవచ్చును అనుభావములు భావము యొక్క ధర్మములు. విభావములు వానికి కారణములు. భావములను పరిపుష్ట మొనర్చువానిని లేక తత్సంబంధములైన కారణములను విభావము లందురు. ఇవి రెండు విధములు. ఆలంబన విభావము ఉద్దీపన విభావము. విశిష్ట భావమునకు ప్రాతిపదిక ఆలంబన విభావము. ఒకవ్యక్తి లేక వస్తువు నాలంబముగా భావములు వికాసము నొందుస్థితి. నాయకుడు లేక నాయిక దీని ఉదాహరణము. ఈ భావములను పరిపుష్టము చేయుటకు తోడ్పడునవి ఉద్దీపన విభావము. వెన్నెలరాత్రులు వసంతఋతువు లనునవి అనురాగమున కుద్దీపనము కలిగించును.

## భావములు-అనుభావములు

హృదయస్థితి లేక అవస్థను తెలుపునది భావము. దానిని దృశ్యమాన మొనర్చునట్లు వ్యక్తీకరించుట, ముఖనేత్రాదుల అవస్థలు లేదా భంగిమలచే తెలుప నవి అను భావములు. వీని భేదములే సాత్త్విక లేక సహజ భావములు. భావములు వ్యభిచారి భావములు, స్థాయి భావములు అని రెండు విధములు. వ్యభిచారి భావ ములు ఒక రసమునకు మాత్రమే పరిమితమై యుండవు. సముద్ర తరంగముల వలె ఆవిర్భవించి అంతరించుచుండును. సహజస్థితిని నానావిధములుగ పరిపుష్ట మొనర్చును. స్థాయి భావములు లవణక్షణములవంటివి. దేనిని స్పృశించు భావ మాస్థితినే పొందును. సాత్త్విక భావములు అనగా సహజభావముల యొక్క వ్యక్తమగు అవస్థ లివి :-

స్తంభము - విశ్చేష్టులగుట
స్వేదము - చెమటపుట్టుట
రోమాంచము - శరీరముపై పులకలు కలుగుట
స్వరవికారము - కంఠస్వరము గాద్గద్యము నొందుట
వేపథువు - శరీరము కంపము నొందుట
వర్ణవికారము - ముఖవర్ణము మారుట; వైవర్ణ్యము
అశ్రువు - కన్నీరు
ప్రళయము - కాళ్లచేతు లశక్తము లగుట-తెలివి తప్పుట

ఇవి భావముల కార్యములు కనుక వీనిని అనుభావములుగను గ్రహింప వచ్చును స్థాయి భావములను కొందరు ఎనిమిది విధములుగను మరికొందరు తొమ్మిది విధములుగను పేర్కొనిరి.

రతి :- ఒక దృశ్యమును చూచినపుడు దానిని గూర్చి వినినపుడు లేక దాని స్మృతి వలన కలిగెడు భావము.

హాసము : సంతోషము.

శోకము : ప్రియురాలి ఎడబాటు వలని దుఃఖము అనగా వియోగదుఃఖము.

క్రోధము : విచారము,దుఃఖముచే వికలమనస్కు లగుట.

ఉత్సాహము : ఉదాత్తమైన ఆలోచనము-వీర, దాన, ఔదార్యములను వ్యక్త మొనర్చు భావము.

భయము : భయము, అవమానము.

జుగుప్స : ఒక అనిష్ట వస్తువును చూచినపుడు దానిని తాకినపుడు లేక దానిని గూర్చి వినినపుడు కలుగు అనిష్టభావము.

విస్మయము: ఆశ్చర్యకరమగు వస్తువును చూచిన, తాకిన, లేక దానిని గూర్చి వినిన హృదయమున కలుగు అవస్థ.

శాంతము: విశ్వములోని సకల పదార్థములను నశించునవిగా భావించు స్థితి.

## వ్యభిచారి భావముల భేదములు

వీని భేదములు దాదాపు ముప్పదిమూడు వరకు గలవు. నాటకము లందలి అత్యంతప్రధానము లైనవి. కనుక వీనినిగూర్చి విశేషములు గమనింప దగినవి. ఒక్కొక్క భావమునకు సంబంధించిన కారణములు వాని లక్షణములు కూడ పరిశీలింపదగినవి.

1. నిర్వేదము : దుఃఖాదులవలన కలుగు నిష్ఫలత్వబుద్ధి.
   విభావము— ప్రాపంచిక అవస్థలవలన విరక్తి, పరతత్త్వ విద్యయం దాసక్తి

2. గ్లాని: బలహీనత - సహనశక్తిని కోల్పోయిన స్థితి.
   విభావము - దుఃఖవిచారముల అతిశయము, ఆనందము; ఆకలి, దప్పి మొదలగునవి అధికముగానుండును.
   అనుభావము - అనుత్సాహమువలన బలహీనత, వైవర్ణ్యము నొందుట, కాళ్ళు చేతుల వణకు.

3. శంక :- కర్తవ్యభయము - అనర్థశంక, కోరిన వస్తువులు లభించని అనుమానము.

విభావము - ఇతరుల క్రౌర్యమున లేక స్వదుర్ణయమున ఆపష్టత.

అనుభావములు - కంపనము, ముఖమున విచార దుఃఖనులు జనించుట, ముఖము తప్పించి తిరుగుట.

4. అసూయ:-పరోత్కర్షము గూర్చి అసహనము, ఇతరుల శ్రేయస్సును కించపరచుట.

విభావము:-మనసు వికలముగా నుండుట, చీదరించుకొనుట.

అనుభావము :-క్రోధాతిశయముతో కనుబొమలు చిట్లించుట. దోషోక్తి.

కొందరు ఈర్ష్యను అసూయకు పర్యాయముగ భావింతురు. కాని ఒకా నొక ఆలంకారికుడు దీనిని అసూయలో నొక భేదముగా పరిగణించి దీనిని ప్రత్యర్థిపొందు అసహన భావమునకు మాత్రమే పరిమిత మొనర్చెను.

5. మదము :- మదగర్వము, హర్షోత్కర్షము వలన వశము తప్పుట, దుఃఖమును మరచుట.

విభావము - మద్యపానాదు లొనర్చుట.

అనుభావము-తూలు నడక, మాటల తడబాటు, ప్రేలుట, నవ్వుట, ఏడ్పు.

6. శ్రమము- అలసట.

విభావము-శారీరకశ్రమ, కోతికల వలన శ్రమ.

అనుభావము — స్వేదము, అశక్తత మొదలగునవి.

7. అలసత : మాంద్యము - అశక్తత, కష్టమునకు భయపడుట.

విభావము:-శ్రమ, నిర్వ్యాపారత, గర్భభారము, విసుగు, భోగలాలసత, విచారము, ఆలోచన.

అనుభావము:_మందమందముగ నడచుట, తలవంచుకొని యుండుట. అవలింతలు, ముఖము వైవర్ణ్యము నొందుట.

8. దైన్యము:నిరుత్సాహము - శ్రమవలన మనోవేదనము, కృశించుట, విభావము_ఇతరుల తూలనాడుట.

9. చింత : తదేకధ్యానము_విచారమున క్రుంగుట_అవిష్టములైన వానిని గూర్చియే నిరంతర విచారము.

విభావము ;_కోరిన వస్తువు లభించక పోవుట. లేక అపహరింపబడుట, పరితాపము.

అనుభావము:_రోదనము. నిట్టూర్పు, ముఖము వైవర్ణ్యము నొందుట, శరీరతాపము.

10. మోహము: ఆందోళనము, మనసు చెదరుట, కింకర్తవ్యమని కలత నొందుట.

11. స్మృతి; అనుభవించిన విషయము జ్ఞప్తికి వచ్చుట.

విభావము: ఆలోచనా పరంపర, జ్ఞాపకమునకు ప్రయత్నించుట.

అనుభావము; కనుబొమలు చిట్లించుట.

12. ధృతి:_ తృప్తి, ఓపిక, సహనము, చిత్తశాంతి.

విభావము:_ నేర్పు, విద్య.

అనుభావము: ఆర్భాటములేని రీతిలో ఆనందము ననుభవించుట, కష్టములను కిమ్మనక సహించుట.

13. వ్రీడ:_ లజ్జ, సిగ్గు.

స్తుతిలేక అవినయమువలన ఫలము గాకుండుట.

విభావము:_ నిజపరిస్థితి తెలిసికొనుట, ఓటమి, పరాభవము.

అనుభావము: సిగ్గుచే మొగము వంచికొనుట_తెలతెలపోవుట

14. చపలత :-చాంచల్యము, తత్తరపాటు-క్షణములో ఒక అంశమును మరియొక క్షణములో ఇంకొక అంశమును ప్రస్తావించుట.

విభావము: ఈర్ష్య,తిరస్కృతి, ద్వేషము, క్రోధము, సంతోషము.

అనుభావము; ముఖముపై క్రోధభావ మావహిల్లుట, తాడనము దూషణము,ఇష్టము వచ్చినట్లు చేయుట, వాక్చాపల్యము.

15. హర్షము: సంతోషము, ప్రశాంతచిత్తవృత్తి.

విభావము-ప్రియజనదర్శనము, పుత్రోదయము మొదలగునవి కలుగుట.

అనుభావము: తడబాటు, స్వేదము, ఆనందబాష్పములు జనించుట, నిట్టూర్పులు వదలుట. స్వరము గాద్గద్యము నొందుట.

16. ఆవేగము-అనిష్టకార్యము వలన కలిగిన అందోళనము, చంచలస్థితి -సంభ్రమము.

విభావము—స్నేహితుడు లేదా శత్రువు సన్నిహితుడగుట ప్రకృతి ఉపద్రవాదులు. అందోళనము.భయోత్పాతము.

అనుభావము : జారుట, పడుట. త్వరగా నడచుటకు ప్రయత్నము చేసియు అశక్తులగుట.

17. జడత: మతిమరపు, కార్యాచరణముపట్ల అశక్తత.

విభావము ; ఆనందము లేక దుఃఖమును కలిగించు పరిస్థితు లేర్పడుట లేదా అట్టి సన్నివేశములను చూచుట, వానినిగూర్చి వినుట.

అనుభావము :_ఊరక యుండుట. రెప్పపాటులేని చూపు.
విచారాతిశయము.

18. గర్వము_స్వాతిశయ భావము కలుగుట.

విభావము: నిజవంశ. సౌందర్య. స్థాయి లేక శక్తిని గూర్చి మాత్రమే ఆలోచించుట.

అనుభావము_ తిరస్కృతి, విలాసముగ చూచుట_ఇష్టము వచ్చి నట్లు చేయుట. నవ్వుట. శక్తిని ప్రదర్శించుట.

19. విషాదము_ అపజయవిచారము, ఉత్సాహభంగము. కష్టము వలని ఆందోళన.

విభావము _ కీర్తి, ఐశ్వర్యము. సంతానము లభించని నిరాశాస్థితి, లేక అవి అంతరించుట.

అనుభావము : చల్లని నిట్టూర్పులు వదలుట, గుండెదడ చికాకుగ నుండుట, మిత్రులను పెద్దలను అన్వేషించుటకై వెడలుట మొదలగునవి.

20. ఔత్సుక్యము_ ఓపికలేమి.

విభావము_ ప్రియునికై నిరీక్షణ.

అనుభావము_ ఆందోళనము, హృదయతాపము, విభ్రమము

21. నిద్ర_తనుమఱపు, ఆలోచనాశక్తి, ఇంద్రియశక్తి సన్నగిల్లుట, జ్ఞానము లేకపోవుట.

విభావము_ శరీరము, గుండె అలసట

అనుభావము_ నరముల బలహీనత, కనురెప్పలు వేగముగ కొట్టుట వలవరింత, ఒడలి విఱుపు, నిద్రలో తూలుట,

22. అపస్మారము : భూత మావేశించుట, గ్రహబాధ

విభావము- అపవిత్రత, ఒంటరి తనము, భయ దుఃఖ
ముల అతిశయము

అనుభావము: కంపనము, నిట్టూర్పు, నురుగు గ్రక్కుట,
నాలుక చాపి త్రిప్పుట, సొమ్మసిలి భూమిపై
పడుట.

23. సుప్తి- నిద్ర

విభావము : నిద్రమబ్బు

అనుభావము- కనులు మూసికొనుట, నిశ్చేష్టులై యుండుట, దీర్ఘ
నిశ్వాసము, గురక లుకొట్టుట.

24. విబోధము- తెలివివచ్చుట.

విభావము- మబ్బుతెరలు వీడుట.

అనుభావము- కనులు నలుపుకొనుట, వ్రేళ్లు విరచుట, చేతులు
కాళ్లు విదల్చుట.

25. అమర్షము- స్నేహద్వేషములను సహింపలేకపోవుట.

విభావము-క్రోధము, అగౌరవము,

అనుభావము- స్వేదము, తనురెర్రబడుట, శిరఃకంపనము,
తాడనము, దూషణము.

26. అవహిత్థ: వేషము మార్చుట, బాహ్యచేష్టలచే మానసిక అవస్థను కప్పి
పుచ్చుటకు ప్రయత్నించుట.

విభావము- లజ్జ మోసము, ప్రగల్భము పలుకుట.

అనుభావము-నిజతత్త్వమునకు భిన్నముగ మాట్లాడుట, లేక
వ్యవహరించుట,

27. ఉగ్రత: క్రౌర్యము దుస్స్వభావము.

విభావము_ దోషము లేక నేరము యొక్క ప్రకటనము.

అనుభావము_దూషణము, తాడనము.

28. మతి_ ఆందోళన, మానసికవిచారము

విభావము_ శాస్త్రాధ్యయనము.

అనుభావము- శిరఃకంపనము- కనుబొమ్మలు చిట్లించుట, సదుపదేశము.

29. వ్యాధి:_ అనారోగ్యము, ఆరోగ్యనాశనము.

విభావము- వేడిమి లేక చలియొక్క ప్రభావము, కలవరపాటు.

అనుభావము_ సరియైన క్రమములో శారీరకములైన మార్పులు.

30. ఉన్మాదము:_ చిత్తవిభ్రమము. ఆలోచన లేదా వివిధనిర్బంధములచే విముక్తినొందుట.

విభావము- ప్రేయసి లేదా ప్రియమైన వస్తువు జారిపోవుట. భాగ్యము వక్రించుట_ నిజపతనావస్థనుగూర్చి విచారము.

అనుభావము- ప్రలాపము- కారణము లేక నవ్వుట, ఏడ్చుట లేక పాడుట.

31. మరణము: మృత్యువు.

విభావము_ ప్రాణము పోవుట, గాయమగుట, లేక ఏదియో ఒక విధమైన ఆపద కలుగుట_

అనుభావము_ భూమిపై పడుట_ చలనములేక పడియుండుట.

32. త్రాసము: అకారణభయము.

విభావము_ భయానకమగు చప్పుడు వినుట_ భయానకమగు వస్తువును చూచుట.

అనుభావము- కదలలేక పోవుట, కంపనము, స్వేదము, కాళ్ళు చేతులు అశక్తమగుట.

33. వితర్కము:- తర్క-వితర్కము, ఆలోచన.
విభావము- మనసులో శంక లేక అనుమానము కలుగుట.
అనుభావము- తలఊపుట, కనుబొమ్మలు చిట్లించుట.

## భావములపై భారతీయ నాటకముల ప్రభావము

నానావిధములగు వ్యభిచారి భావముల వివరణము దాదాపు పూర్తియైనది. సామాన్యరీతిలో వీనిని పరిశీలించినను, ప్రాచీనాలంకారికులు మానవుని భావ సముద్రమున దగిన రత్నవిధులను చేరినట్లు స్పష్టమగును. అంతియేకాక వానిని గూర్చి సమగ్రదృష్టితో పరిశీలన మొనర్చి వానిపై ఆధిపత్యము కూడ వహించిరి. వివిధభావముల నిర్వచనము - వివరణము ఒక ఎత్తు - వానికి సంబంధించిన విభావ-అనుభావముల పరిశీలనము, పంచేంద్రియములపై వాని స్వభావ నిరూపణము మరియొక ఎత్తు. ఇవి అన్నియు ప్రకృత గ్రంథము యొక్క ప్రగాఢ పరిశీలన దృష్టిని నిరూపించును. ఇవి నాటకమునకు ప్రాణతుల్యములు కవికి నటునకు ఆధారసూత్రములుగ తోడ్పడునట్టివి. అవి ఆచరణ యోగ్యములనుట కెట్టి సందేహము లేదు.

రసభేదములు :- బాహ్య అంతరింద్రియములకు మధ్య గల సామ్యముపై రససిద్ధాంత మాధారపడియున్నట్లు ఇంతకు ముందే వివరింపబడినది. ప్రేమ లేక ద్వేషములకు మాధుర్యము మరియు చేదులక్ష్యము లైనట్లు - అన్వయరీతి సంస్కృతము నందే ప్రత్యేకముగ లేదు ఇతర భాషలందును ఇది కలదు. రసమునకు ఆధారకేంద్రము మాట లేక వాక్కు - ప్రేక్షకులకు లేక శ్రోతలకు కలుగు ప్రభావము వలన అది గుర్తింప బడును. సామాన్యముగ జూచిన అవి స్థాయిభావములుగ దోచును. కాని అది అట్లుకాదు దానికి భిన్నమైనది.

5

అవి భావముల ఫలము లేక ప్రభావములని చెప్పవచ్చును. ఈ రసములు ఎవిమిది అని భరతుడు నిరూపించెను. వీనిని కొందరు నవ విధములని పేర్కొనిరి.

1. శృంగారము 2. హాస్యము 3. కరుణము 4. రౌద్రము 5. వీరము 6. భయానకము 7. భీభత్సము 8. అద్భుతము 9. శాంతము.

ఇందు మరి కొన్నింటిని చేర్చవచ్చును. కాని తక్కిన భావములీ ఎనిమిది లేక తొమ్మిది రసములలో దేనిలోనైనను చేర్చదగినవై యుండును. పితృ ప్రేమను కరుణ యందు చేర్చుటకు అవకాశము కలదు.

గ్రీకు నాటకములు కరుణ భయానకములకే పరిమితమై యుండును. కాని నిశ్చిత దృష్టితో పరిశీలించినచో ఇవి కూడ ఇతర భావములపై ఆధిపత్యము నొందునని స్పష్టమగును.

శృంగార తత్త్వము— భారతీయ నాటకములలో శృంగారము ప్రధానముగ పోషింపబడినవి ప్రణయము నామ మాత్రముగ లేని నాటకములు కొన్ని కలవు. భారతీయ నాటకము నందలి శృంగారము గ్రీకు లాటిను సుఖాంత నాటకముల కంటె తక్కువ స్థాయితో నున్నదని విల్సన్ పండితుని అభిప్రాయము. ఫ్రెంచి ఆంగ్ల భాషలలోగల విషాదాంత నాటకములందు వలె ఇది అంతగా తత్త్వ పూర్ణమైనది యనుగాదు. నేటి ఆంగ్ల నాటకములోని లజ్జారహితము, సామాన్యస్థాయికి దిగజారినట్టిదియును అశ్లీల శృంగార భూయిష్టము కాదు. భౌతిక అధి భౌతిక శృంగారముల కభేదము జాటునంతటి ఉదాత్తమైనదియుకాదు. దీనితోపాటు అంత విశృంఖల మైనట్టిది లేదా రస విహీనమైనదియు శుష్కమగునట్టిదియును కాదు. ప్రేయసీ ప్రియుల అవస్థలు మూడు విధములుగ నిరూపింపబడినవి.

సంభోగము :— ఒకరి నొకరు కలిసి యుండు స్థితి — నాయికా నాయకులు పరస్పర మనురక్తులగు ఒక చోట నుండి సుఖించుట.

2. అయోగము :- ఒకరి నొకరు కలిసికొన లేని స్థితి, పరస్పర మను రాగము నొందని స్థితి.

3. విప్రయోగము :- సంయోగానంతరము కలిగిన ఎడబాటు. వాస్తవముగ ఈ అవస్థా భేదములు రెండే. అవి సంభోగ విప్రలంభ శృంగారములుగ ప్రసిద్ధమైనవి.

దశరూపకములందు సంభోగ శృంగారము రెండు విధములుగ విడా పింప బడినది. 1. అయోగము - అనగా ప్రేయసీప్రియులు కలసికొనుటకు ముందే కలుగు వియోగదశ, 2. విప్రయోగము వారు - కలిసికొన్న అనంతరము వియోగ దశ.

అయోగమునకు ఇతరుల అధీనమున నుండుట - దూరముగ నుండుట - లేక దుర్విధి అనునవి కారణములు కావచ్చును - వీని దశలు పది అని ఆలంకారికులు నిర్దేశించిరి.

అభిలాషము — కోరిక, చింతనము = ఆలోచన విచారము, మొదలగునవి.

దీనికి విభిన్నముగ విప్రయోగమునకు కారణములు రెండు

మానము — ఈర్ష్య లేక తిరస్కృతితో విసుగు నొందుట లేక అలుక వహించుట — ప్రణయ భంగము.

ప్రవాసము - ప్రయాణము - దూరదేశముల పాలగుట .

మానము. ప్రతిజ్ఞా భంగము — ప్రణయము తిరస్కరించుట వలన కలుగును - నాయికా నాయకులలో ఎవరైనను దీనికి కారకులు కావచ్చు. కాని నాయకుని వలన యిట్టిది జరగదు.

మానము కూడ ఎన్నియో విధములు :—

ఈర్ష్యామానము - లోలోపలనే ఈర్ష్యా సూయల నొందుట

అనుమానిత మానము - అనుమాన పూర్ణమైనది - నాయిక అలుకపు ఈర్ష్యను తొలగించుటకు ఉపాయములు ఆరు కలవు.

1. సామము — మధుర వచనములు పలుకుట.
2. దానము — ఏదేని నొసగుట.
3. దండనము - శిక్ష
4. నతి
5. ఉపేక్ష = వదలుట.
6. రసాంతరము = నిత్య నూతన రీతిలో అనురాగమును వ్యక్తీకరించుట.

నాయిక ననుకూలిగా సుముఖిగా చేయుట కష్టమైనచో మానము యొక్క స్థితిని 'గురువు' అని అందురు. అధిక శ్రమకానిచో లఘువు, అది సులభముకానిచో మధ్యమము అనబడును.

వీరము- అనగా ధైర్యము - దీని లక్షణములు మూడు. దానము - దయ - ధర్మము.

ధర్మము అధిక ఉత్సాహము ఆవేశములో చేయకూడదు. ప్రశాంతముగ నుండవలయును.

భీభత్సము- మలిన పదార్థములను జూచినను, దుర్గంధము నాఘ్రాణించినను, భయానక ధ్వనులు వినినను కలుగు అవస్థ ఇది అనిష్టమైన దీనిని ప్రధాన రసముగ గ్రహించి నేటి వరకును ఎవరును నాటకమును రచించలేదు. అట్లు వచించినచో అది కూడ రోత కలిగించి తిరస్కరింపబడి యుండెడిదేమో!.

రౌద్రము:- విపరీతముగ ఆవేశము కలుగు స్థితి - కాళ్ళు చేతులు కొట్టుట - తిట్టుట - కొట్టుట - అనునవి దీని లక్షణములు - ఈ రసము నాటకములో కొన్ని సన్నివేశములలో పాత్రలలో మాత్రమే పోషింపబడినది.

హాస్యము :- విచిత్రవేష భాషల పరిహసించునపుడు కలుగు హాసము వివిధ రీతులు గల నవ్వు దీనికి లక్షణములు.

1. స్మితము: కనులు వికసించినట్లు నవ్వుట

2. హసితము: పండ్లు కనబడునట్లు నవ్వుట,

3. విహసితము: మధురమైన కంఠధ్వని కలుగునట్లు నవ్వుట.

4. ఉపహసితము: ఆనందాశ్రువు లేర్పడు నంతటి హర్షాతిశయము—తల కదలునట్లు నవ్వుట.

5. అపహసితము: కన్నులనీరు కారునట్లు నవ్వుట.

6. అతిహసితము; విరగబడి నవ్వుట. ఒడలుకదలునట్లు నవ్వుట.

మొదటి రెండు విధములైన హాస్యము నాగరికమైనది. ఉత్తమమైనది. మూడవది నాలుగవది అనాగరికము. మధ్యమము అయినను అంగీకృతము. అయిదవది ఆరవది అధమమైన హాస్య మనబడును.

అద్భుతము- ఆశ్చర్య వ్యక్తీకరణము అతిలోక అసామాన్యములైన పరిస్థితులను లేక వస్తువులను జూచునపుడు కలుగు విస్మయ భావము. కేకలువేయుట, కంపనము, హర్షావేశము మొదలగునవి దీని లక్షణములు.

భయానకము: భయావస్థ, భయమును కలిగించు సంఘటనల వలన కలుగును, శరీరమునందు గగుర్పాటు_స్వేదము. నోరు ఎండిపోవుట, దైన్యము. కర్తవ్య అశక్తత, వీని అనుభావములు.

కరుణము : కష్టములు, ఆపదలు కలుగునప్పటి శోకావస్థ, అశ్రువులు రాల్చుట నిట్టూర్పులు, బుద్ధి పనిచేయని స్థితి, శరీరము తూలుట, మనసు వికలమగుట, అసువులు వీడుట, వీని అనుభావ వ్యభిచారి భావములు.

శాంతము: నీతిప్రధానకవితకు అనుచితము కాకపోవచ్చును. నాటకము నను సరించికాదు.నాటకమువలన ఈ భావము అంగీకృత మగునట్లు ఉద్బు ద్ధము చేయవచ్చును.

సూత్నధీశక్తిగల ఆలంకారికులు కొందరు ఈ నవరసములకు వర్ణము లను కూడ నిర్ణయించి వానికి నొక్కొక్క దైవతము నధిదేవతగ నిట్లు నిరూ పించిరి.

| రసము | వర్ణము | దైవతము |
| --- | --- | --- |
| శృంగారము | శ్యామ | విష్ణువు |
| హాస్యము | శ్వేతము | రాముడు |
| రౌద్రము | రక్తము | రుద్రుడు |
| వీరము | హేమవరము | శుక్రుడు |
| కరుణము | కపోతవర్ణము | వరుణుడు |
| భయానకము | నలుపు | యముడు |
| బీభత్సము | నీలము | మహాకాలుడు |
| అద్భుతము | పసుపుపచ్చ | బ్రహ్మ |

వివిధ రసముల సమ్మేళనము వివిధ భావముల ప్రభావము అను అంశములను భారతీయాలంకారికులు మరింత సూక్ష్మదృష్టితో పరిశీలించిరి. నాటక కర్తలీ అంశముల సమగ్ర పరిశీలన కేమాత్రము సందేహించలేదు, వాని వివరము లిట అనవసరము.

## నాటకరీతులు

భరతుని మతము ననుసరించి నాటకరీతులు నాలుగు. వీనిలో మొదటి ఇతివృత్తములు సన్నివేశములకు, నాల్గవది భాషకు సంబంధించినది.

1. కైశికి: విధానము హృద్యమై యుండవలయును. నాయక హృదయాను రాగమును ప్రియువిచిత్రము లభించుటలో వ్యక్తము చేయుట దాని నామె చెలికత్తెలకు తెలియని రీతిలో వర్తించును.

2. సాత్వతి- కల్పిత పాత్రములు లేక కూటసాక్ష్యము వలన కలుగు మోస భయము,

3. ఆరభటి: భయానక దృశ్యములు. యుద్ధము, సంరంభము, ఆందోళన ప్రకృతి వైపరీత్యము మొదలగునవి.

4, భారతి: సరసమైన భాషారీతి.

## నాటక భాష

భాషాదృష్టితో పరిశీలించినపుడు భారతీయ నాటకములలో వైశిష్ట్యము లెన్నియో గోచరించును. కవి విలక్షణమును హృద్యమును అగు పదజాలమును ఉపయోగించవలయును. వ్యక్తీకరణ విధానము హృదయరంజకమై, సరసమై యుండవలయునని భరతుడు నిర్దేశించియుండెను. సాధారణముగ నీసూచనల నందరును పాటించిరి. ప్రాచీన నాటక కర్తలగు కాళిదాసు, భవభూతుల

రచన సరళసుందరమైనది. కాని అనంతర నాటకకర్త లాలంకారికభాషను శైలిని ఉపయోగించిరి. భాష భావవ్యక్తీకరణమునకు వాహిక కాక పాండిత్య స్ఫోరకమని అది నిరూపించినది

భారతీయ నాటకములో సామాన్యసంభాషణము వచనములో నుండును. భావమును శక్తిమంతముగ వ్యక్తీకరించు సందర్భములందు దృశ్యచిత్రీకరణము నందు కవి తనకు గల కల్పనాపై చిత్రిని దర్శింపజేయ దలచినపుడు అది పద్య రూపమున గావించబడును.

## నాటకము-ఛందస్సు

నాటకములందు ప్రత్యేకమైన ఛందస్సులోనే శ్లోక రచన గావించవల యునను నియమములేదు. కాని ఏఛంధముననైనను ఎనిమిదేసి గణముల నాలుగు చరణముల గల అనుష్టుప్ నుండి ఇరువదేరు మాత్రలనుండి 199 వఱకు గల దండకమును గాని గ్రహింపవచ్చును. వివిధ ఛందస్సుల నుపయోగించుట వలన వివిధ సంగీతధోరణులను రమ్యముగ వ్యక్తీకరించ వచ్చును. విక్రమో ర్వశీయములో 17, 18 విధములగు ఛందస్సు లుపయోగింపబడినవి. అన్నింటి యందు గణభేదము స్వల్పమే. భాషాదృష్టిలో చూచిన భారతీయనాటకము. లందు ప్రపంచ నాటకములలో లేని వైశిష్ట్య మొదట కనిపించును. ప్రతిపాత్ర తనస్థాయి ననుసరించి ప్రత్యేకమైన భాషలో సంభాషించును. నాయికా నాయ కుల విప్రుల మొదలగు పాత్రల సంస్కృతమున మాటలాడుదురు. మిగిలిన వారు తమ దేశమును స్థాయిని అనుసరించి ప్రాకృత భాషాభేదములలో సంభా షింతురు. వివిధ వర్గములవారికి ఆలంకారికుల ఆయాభాషలను కూడ నిర్దేశించిరి. కాని నాటకములో సాధారణముగ సంస్కృతము ప్రాకృతము అను రెండు భాషలే గ్రహింపబడినవి.

# రంగస్థలము - పరికరములు

భారతీయ ఆచారవ్యవహారములతో పాశ్చాత్యు లపరిచితు లగుటవలన ప్రాచీన నాటకముల ప్రయోగ విధానమును గూర్చి వివరములు గ్రహించుట కష్టము. కాని ఇరువది అయిదేండ్లకు పూర్వము పారశీక నాటకముల ప్రచారమునకు ముందు ఇంద్రసభయొక్క ప్రదర్శనము చూచినవారు నాటక ప్రయోగమును సులభముగ గ్రహింప జాలుదురు. హైందవులు సంప్రదాయ పరాయణులు. అన్యుల ప్రభావము లేక పత్తికి వలన మాత్రమే ఇక్కడి ఆచార వ్యవహారములలో మార్పు సంభవము. సంగీత రత్నాకర మును చదివిన ఇది స్పష్టము. సభ ఏర్పాటైన తర్వాత సంగీతజ్ఞులు వచ్చి నేర్పును ప్రదర్శింతురు. తర్వాత తెర వెనుక నుండి నట్టువరాండ్రు ప్రవే శించి వందన మాచరించి నాట్య సంగీతముల నారంభింతురు. నాటకములందు రంగస్థలముపై ప్రవేశించుటకు, నిష్క్రమించుటకు, తెరను కదలించి విచ్చుటకు గల నియమములలో ఈ అంశమే స్పష్ట మగుచున్నది. ప్రాచీన కాలములో తెరను గట్టిగా అమర్చు చుండిరి. నేపథ్యము వెనుక పాత్రధారులు తమ ఆహార్యమును వేసికొనుచు సవరించుకొను చుండిరి. రంగస్థలముపై ప్రవేశించి తమ నేర్పును చూపుచుండిరి. నాటకమునకు ప్రత్యేక గృహము కాని దృశ్యములుకాని లేకుండెను. వేషధారణము గూర్చి మాత్రమే ప్రత్యేక శ్రద్ధ వహింప బడుచుండెను. సింహాసనము, ఆయుధములు మొదలగు పరి కరము లుపయోగింపబడు చుండెను. రథమును ప్రాణము గల జంతువు లీడ్చుట కేర్పాటు చేయుచుండిరి. స్త్రీ పాత్రలు సాధారణముగ స్త్రీలే ధరించు చుండిరి. కొన్ని సందర్భములలో మాత్రము యువకులు ధరించు చుండిరి. ఒక్కొక్క రనుసరించదగిన విధానము నాటకము నందు సూచింపబడు చుండెను.

## 42

# భారతీయ నాటకములను మహమ్మదీయు లేల అనుకరించలేదు

భారతీయ నాటకముల సంగ్రహ స్వరూప మిది. ఎంత సంగ్రహముగ వ్రాయవలయునని అనుకున్నను పీఠిక పరిధిని దాటినది. మహమ్మదీయులు భారతీయ నాటకములను గూర్చి ఆసక్తి చూపి ఏల అనుకరించ లేదను అంశము పరిశీలనార్హము. ప్రతి యుగమున ఇతరుల విద్యలు కళలను గూర్చి ఆసక్తిని వారు వ్యక్తీకరించినను వారికి తమ విద్యల పట్లనే స్వాభిమాన పూర్వక గర్వ భావ ముండెను. వారు ఇతరుల జాతీయ విద్యలు సాహిత్యములపై ఏ మాత్రము దృష్టి మరల్చలేదు. ఈ కారణముచేతనే హారూన్ రషీదు మరియు మామూన్ కాలమున గ్రీకు విద్యలు, కళలు మున్నగు వాని ప్రచార మధికమైనది. కాని విద్యా సాహిత్యముల రంగమును చూచినచో హోమరు — యూరిపిడస్ ప్రస్తావన ఏల? అరిస్టాటిలు కృతులు అనువాదమే కాలేదు — అవి స్పష్ట మగును. ఈ విధముగనే ముసల్మానులు భారతీయుల నుండి అనేక విద్యలు కళలను గూర్చి ఎన్నియో విషయములను గ్రహించినను వారి సాహిత్యములోని అమూల్య విధులతో లాభము నొందలేదు. దీనితో మన అభివృద్ధి సమగ్రముగ సాగలేదు. విశాలదృష్టి లేనందున నూత్న దేశీయులపై ఆసక్తి కలుగలేదు. భారతదేశములో ఉర్దూకవిలో అవతరించిన వైభవ రీతి వర్ణనాతీతము. వారికి పారశీక కవితపై ప్రగాఢాభిమాన మని అందరికి తెలియును. నేటికిని ఈ దృక్పథమే బలీయమై యున్నది ఉర్దూ భాషవలె దీని పునాదికూడ సంస్కృతముపై లేదా "భాకా" (ప్రజల వ్యవహార భాషావిశేషము) పై ఆధారపడి యుండినచో నేడు పరిస్థితులు మఱియొక విధముగా నుండెడివి. దీనిలో భావ వ్యక్తీకరణ శక్తి, విధానము మరియొకరీతిలో భాసించెడిది. ప్రతిజాతికి ప్రాణ తుల్య మైనది—సాహిత్యమున సమకాలిక ప్రతిబింబము. దానికై వ్యర్థముగ ఉర్దూ భాషలో వన్వేషించు చున్నారు, ఒకానొక గుణములేని స్థితి ఉండెడిది కాదు.

ఈ అంశమును స్పష్ట మొనర్చుటకై దృశ్య కావ్యమునే తార్కాణముగ గ్రహింపవచ్చు. ప్రశస్త రచనారీతి - వ్యక్తీకరణ విధానము - కల్పనా చమత్కృతులు గల ప్రక్రియ - పాశ్చాత్యులను కూడ ఈ ర్ష్యాసూయా పరుల జేయజాలినట్టి దృశ్య కావ్యము సన్నిహితమై యుండ, నేటికిని మన కవుల దృష్టి ప్రసరించ లేదు. మన కవులకు దృశ్య కావ్య రచనా సామర్థ్యమునం దెట్టి కొరత లేదు అవధ్ ప్రభువుల భోగలాలసత వలన సామాన్యమైననాటక మొకటి ఆవిర్భించినదేమో! హాస్యము, వినోదము, ధైర్యము, వీరము మొదలగు భావముల చిత్రణములో సౌదా కవి సిద్ధహస్తుడు కదా! వివిధ వృత్తుల వారి జీవితమును వీరి కంటె ఘనముగా నెవరు చిత్రించ గలరు? అనురాగ శృంగారావస్థల వర్ణించుటలో 'మీర్' కవిని మించినవా రెవరు? సరసగోష్ఠి ప్రసంగములలో మీర్ హసనునకును, కరుణ రసాత్మక సన్నివేశములను రమ్యముగా చిత్రించుటలో మీర్ అనీస్‌కును సాటివచ్చువా రెవరు? సామాన్య శృంగారము ప్రేయసీ ప్రియుల నర్మగర్భోక్తుల గూర్చుటలో నవాబు మిర్జాషౌకు కంటె సమర్థు లెవరు? హాస్య అధిక్షేప రచనలలో ముషీర్ కవి లేఖినికి గల శక్తి ఎవరికి గలదు? నజీర్ అక్బర్ ఆబాది దృష్టి పడినచో ఎంతటి బంగారు పంట పండెడిది. అది ఏమో కాని మన కవులకు ఎవరికి భారతీయ నాటకముపై ఆసక్తి గలుగలేదు. ఆ ప్రక్రియను గూర్చి వారు పట్టించుకొనలేదు. పారశీక కవులు చూపిన మార్గముననే ముక్కుకు సూటిగా నడిచి తమకుగల ప్రతిభను చాటినారు. ఇన్ని నిర్బంధము లున్నను వారు తమవ్యక్తిత్వమును విలువుకొని నేర్పును ప్రదర్శించినారు. పాశ్చాత్యుల ఆలోచనా విధానము వల్ల ఉర్దూ కవితలో కూడ నూతన కాంతి ప్రసరించినది. అదియు తగినంతరీతిలో స్వచ్ఛముగా ప్రకాశించలేదు.

## ఉర్దూకవితలో నవజీవనము - క్రొత్త ఊపిరి అవసరము

ఉర్దూకవిత నేడు విందు ఆవ్యవధము యొక్క ఉత్కృష్టదశలో నున్నది.

విమాత్నశక్తి ఆవిర్భవించలేని వార్ధక దశ దానికింకను రాలేదు. కనుక ఈ దశలో వివిధ భాషలలోని అమూల్యరత్ననిధుల నన్వేషించి వెలికి తీయుటకు పండితులకు, కవులకు అవకాశము కలిగించవలయును. పారశీకుల దృఢ దీక్ష వలనను వారిని అనుకరించుట వలనను, మన భాషలో కూడ కొన్ని నాటకములు వెలువడినవి కాని వాటిలో అధికము మన భాషలో ప్రావీణ్యము లేని వారి చేతనో, అన్య భాషా సాహిత్యములోని కవిత్వ కళ లేక దృశ్య కావ్యములతో అపరిచితులైన వారి వలననో, రచింపబడినవి. ఈ కారణము వలననే నేటి వరకును మన భాషలో లైలామజ్నూ లేక ఒకటి రెండు ఆంగ్ల నాటకముల అనువాదములు తప్ప సాహిత్యమున కలంకార ప్రాయము లవదగిన ప్రశస్త నాటక మొకటియైనను వెలువడలేదు. ఇందువలననే నేను సంస్కృత నాటకముల ఉర్దూ అనువాదముల ఆవశ్యకతను గూర్చి తెలుపుటయే కాక, నాటకము, నాటక శిల్పము, నాటక కళ, రూపక శాస్త్రమును గూర్చి సమస్తాంశముల ప్రాధాన్యమును గూర్చియు వివరించుట అవసరమని అట్టి ప్రయత్నమునకు సంకల్పించితిని. సముద్ర తరంగములచే తాడితములైన మన ఉర్దూ కవుల పారశీక నౌకలకు ఈ శాస్త్రము దీపస్తంభము వలె మార్గదర్శకము కాగలదు. ఇట్టి అవసరమున కింకొక ప్రధాన కారణము కలదు. దేశ దౌర్భాగ్యమున భారత దేశము నందలి రెండు ప్రధాన జాతులు హిందువులు - మహమ్మదీయులకు పరస్పర ద్వేషభావ మంకురించు చున్నది. దీనిని తొలగించుటకును వీరికి పరస్పర సామరస్యము సంతరించుటను ఏకైక మార్గమిది యొకటియే అని తోచినది. ఒకరి సాహిత్యముతో మరియొకరు పరిచయము కలిగించుకొని లాభము నొందుట అవసరము. పారశీక సాహిత్యము ఉభయ జాతుల వారికి భౌతిక, ఆధ్యాత్మిక అభ్యున్నతికి తోడ్పడునను కొంటిమి. దాని వలన కుదురలేదు.

## కాళిదాసు జీవిత విశేషము లజ్ఞాతముగ నుండుట

నాటక స్వరూప స్వభావములను గూర్చి పరిశీలించిన అనంతరము

ఈ కావ్య ప్రక్రియాంబరమునకు భాస్కరుడై ప్రకాశించువాడును, తన ప్రతిభాపాండిత్య కిరణకాంతులచే ప్రాచ్యపాశ్చాత్యులకు వెలుగుబాటలు చూపిన మహాకవియనగు కాళిదాసుని గూర్చి విశేషములు గ్రహించుట అవసరము. మాతృభూమియైన భారతదేశమున ఈతడు కవికుల గురువుగను, కవిచక్రవర్తిగను, సుపరిచితుడు. సాటిలేని ప్రతిభా సంపన్నుడు. అయినను ఈతని జీవిత విశేషములు కాలాంధకారమున అదృశ్యమై యున్నవి, ప్రాచ్యపాశ్చాత్య పరిశోధక పండితులు క్రీ. పూ 300 నుండి 600వరకు గల మధ్యకాలమున ఈ కవి జీవించి యుండెనా? అని చిరకాలము వరకు నన్వేషించిరి. కాని ఎట్టిఫలము లభించలేదు. ప్రపంచ ప్రఖ్యాతుడైన ఈతడు తన పాద ముద్రికలను కాలమను ఇసుకపై అలంకరించెను. అవి మాయని ముద్రలు. ఇంతటి మహాకవి కాలమును గూర్చి పరిశోధకులు విద్వాంసులు శతాబ్దములనుండి అన్వేషించినను సాఫల్యము నొందక పోవుట వింతకదా? ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసులు వివిధ విధ్యలను ప్రశంసించిరి. అందరి నాశ్చర్య చకితుల నొనర్చునట్టి నూత్న విశేషముల కనుగొనిరి. పరతత్త్వ పరిశీలనమునకు పరిమిత మొనర్చిన వారిదృష్టి కాళిదాసు పాద ముద్రికల గుర్తించ రాని విధముగ మాయజేయలేదు. కాళిదాస కవి తన భౌతిక విశేషములను ఆంతర కవితాతత్త్వ వ్యక్తీకరణమునందే పూర్ణముగా మగ్న మొనర్చెను. ఈ మహాకవి తన కృతులలోని ప్రతి పదము, శ్లోకము, చరణ భాగములలో తన ప్రతిభా విశేషములు, ఉదాత్త కల్పనా చమత్కృతి పాండిత్యవైభవము, గంభీర పరిశీలనాత్మకదృష్టి మున్నగు వానిని ప్రస్ఫుటముగ దర్శింపజేసెను. కాని ఇతర విశ్వకవులవలె నిజజీవిత విశేషములను తన కావ్యమునందు ఛాయా మాత్రముగ నైనను చూపలేదు. ఈ ఒక్క అంశమే అతని ప్రావీణ్యమునకు తార్కాణముగా నున్నది.

మహాను భావులు వినమ్రులు
నమ్రత వారి జీవగుణం
ధ్యేయము నందుకొనినంత
పాదదాసులై యుందురు.

అను ఒకానొక కవిసూక్తి ఈతని పట్ల సార్థకమైనది. మానవుని అగాధ హృదయ సముద్రమున దాగియున్న రహస్య రేఖలను ప్రకృతిలోని రామణీయకమును హృద్యమైన లేఖినితో చిత్రించినాడు. కాని ఈతని కృతుల నెంత సూక్ష్మాతి సూక్ష్మ దృష్టితో పరిశీలించినను అతని జీవితచ్ఛాయలు రేఖామాత్రముగనైన కనిపించవు. జీవిత విశ్వగ్రంథపు పుటలలో అతడు తనను గూర్చివదలిన స్మృతిరేఖలు బహుళ ప్రాచుర్యము నొందిన ప్రశస్త కావ్యముల రూపముననే ఉన్నవి. అవి మాత్రము కాలగర్భకరాళహస్తములను దరికి రానీయలేదు.

## కాళిదాసు విక్రమాదిత్యుని నవరత్నములలో ఒకడా?

ఉజ్జయినీ రాజ్యాధీశుడగు విక్రమాదిత్యుని అస్థానము నలంకరించిన నవరత్నములలో కాళిదాసు ఒకడని ప్రతీతి. బాహ్య అభ్యంతర సాక్ష్యాధారముల ననుసరించి పరిశీలించినపుడు ఇది సత్య సమ్మతమనియే తోచును. ఉజ్జయినికి సంబంధించిన మహాకాలుడు, శిప్ర, మరియు ఇతర వైశిష్ట్యములను రమణీయముగా వర్ణించిన విధ మాతని మాతృదేశాభిమానమును చాటుచున్నది. విక్రముని ప్రసక్తి వచ్చిన ప్రతి సందర్భమునందును అతని నామమును గౌరవ పురస్సరముగ ప్రస్తావించినాడు. ఈ కవి తన పోషకుని స్థిరకీర్తునిగా జేయు సంకల్పముకంటె అన్య మేమియు భాసించదు కాళిదాసు ఆస్థాన సంప్రదాయములతో సుపరిచితుడు అతని జీవితము కూడ వైభవముగను, ఆనందదాయకముగను సాగినట్లే తోచును. ఈ అంశముల వలన నాతడు విక్రమాదిత్యుని కాలమున జీవించెననియు, నాతని ఆస్థాన రత్నమై ప్రకాశించెననియు స్పష్టమగును. పరిశోధకులు చిరకాలము వరకు విక్రమాదిత్యుని కాలమును గూర్చి విభిన్నాభిప్రాయములను వ్యక్తీకరించిరి. క్రీ. పూ. 570తో ఆరంభమై ఈతని పేర వెలా మణియైనది విక్రమ సంవత్సరము కాని 600 సంవత్సరమునకు పూర్వమునాటి శాసనము ఒకటియైనను చిరకాలము వరకు లభించలేదు. భారతదేశ చరిత్రలో కొరూరు యుద్ధములో విక్రమాదిత్యుడు మఱ్ఛుల నోడించిన సందర్భము విశిష్టమైనది. ఆల్బెరూనీ మతము ననుసరించి ఈ యుద్ధము 544లో జరిగినట్లు తెలియును. ఈ అంశముల గ్రహించి విక్రమ సంవత్సరములో 544

ఆరంభమైయుండునని ఫెర్గూసన్ భావించెను. ఈ ఆధిపత్యమును స్థాపించుటకై దీని ఆరంభము 600 సంవత్సరములకంటె పూర్వము అని నిర్ణయించి యుండును. కాని ఈ సంవత్సరమునుండి అనగా 600నుండి శకము నారంభించుటలో ప్రత్యేకమైన కారణము కనిపించదు. అంతకు ముందు శాసన మొకటి యైనను లభించ నందున ఈ అభిప్రాయమునకే బలము చేకూరినది. కాని 494 నాటి శాసన మొకటి ముందేసర్‌లో లభించినది. దీనితో పై అనుమానము కూడ తొలగి పోయినది.[1] కొరూర్ యుద్ధమున విజయము సాధించిన విక్రమార్కుడే ఈ సంవత్సరము స్థాపించెనని నిరూపితము కాలేదు. ఒకానొక జర్మను పండితుడు నవరత్న సంప్రదాయముతో కాళిదాసుని కాలమును నిర్ణయించుటకు ప్రయత్నించెను. కాని సఫలీకృతుడు కాలేదు. నవరత్నములలో ప్రముఖులగు వారి కాలమును నిర్ణయించినచో వారికి సమకాలికుడగు కాళిదాసు కాలము స్పష్టముగా తెలియునని ఆతడూహించెను. వీరిలో అమర దేవుడు లేక అమరసింహుడు అను వానిని గూర్చి పరిశీలించి ఆతడు చీనా యాత్రికుడు ఫాహియాన్ యువాన్‌చాంగుల యాత్రల మధ్య కాలమున అనగా క్రీ. శ 414నుండి 642AD లోగా జీవించి యుండునని భావించిరి. ఫాహియాన్ కాలములో గయలోని మందిరములో యువాన్‌చాంగు చెప్పిన ప్రకారము అమరదేవునిచే నిర్మితమను అంశమును చాటు శాసనము లేకుండెను. అంతియేకాక ఇంకొక రత్నము వరాహ మిహిరుని గూర్చి పరిశీలింప ఆతడు క్రీ.-శ. 587లో మరణించినట్లు తెలిసినది. డాక్టర్ కరన్ వీనిని ఆధారముగ గ్రహించి కాళిదాసు క్రీ, శ 6వ శతాబ్ద్యంతమున జీవించెనని నిర్ణయించెను. కాని భారత దేశమున అమరదేవులు, వరాహ మిహిరులు అనువారు ఎందరు జన్మించి కాలమను ఇసుకపై పాదముద్రికలను రేఖా మాత్రముగ వదలి అంతరించిరో తెలియదు. కనుక గయలోని మందిరమున గల శాసనము వలన

---

1 ప్లీట్ పండితు డీశాసనమును పరిశోధించి విక్రమాదిత్యుడు ఆరవ శతాబ్దిలో జీవించెనని స్పష్ట మొనర్చెను. ప్రాచీనమైన ఒకానొక శకమును తన దండయాత్రతో ముడిపెట్టెను కాని పలువురీ అభిప్రాయము నంగీకరించుట లేదు.

గాని వరాహమిహిరుని ఆస్తమయ కాలము వలన గాని వారే కాళిదాసుతోపాటు విక్రమాదిత్యుని సభ నలంకరించిన నవరత్నముల లోని వారనుట సాహసో పేతమైన విషయమే. అది విజ్ఞు లంగీకరింపదగినదిగా లేదు. ముందేసర్ శాసనము వలన వీరు కాళిదాసు సమకాలికులగుట అసంభవమని తేలినది. ఈ వరాహ మిహిరుడు, అమరదేవుడు, నవరత్నములలోని వారే అని క్షణ కాల మంగీకరించినను వారే కాళిదాసు సమకాలికులను అంశము స్థిరపడదు. సాధారణముగ కాలముననుసరించి ముందు వెనుకగ జీవించిన వారిని ఒక ప్రసిద్ధుని కాలములో జీవించి యుండిరని ప్రచార మొనర్చుట. ఇట్లు జరుగుట కాలము ప్రసిద్ధ పురుషులకు శత్రువు కాదని తెలుపుటకో ఏమో.

## డాక్టర్ మాక్సుమూలరు అభిప్రాయము

ఈ సందర్భమున డాక్టరు మాక్సుమూలరు ప్రతిపాదించిన అభిప్రాయ మొకటి పరిశీలనార్హము. ఈ పండితుడు సంస్కృత సాహిత్యమును రెండు యుగములుగ వర్గీకరించెను. మొదటిది వైదికసాహిత్య యుగము క్రీ. శ. మొదటి శతాబ్దితో పూర్తి అగును. రెండవ యుగము క్రీ. శ. ఆరవ శతాబ్దినుండి విక్రమాదిత్యుని కాలముతో ఆరంభమగును. ఈ రెండు యుగములకు మధ్యకాలమున భారతదేశముపై విదేశీయుల దండయాత్రలు జరిగినవి. దేశమున ప్రశాంతవాతావరణము లేనందున సాహిత్య వికాసమున కవకాశము కలుగలేదు. కాని ఈ అభిప్రాయము సరియైనది కాదు. డాక్టరుభీలరు, పియర్సన్ అను పండితులు ఈ యుగమునందును సాహిత్య వ్యవసాయము కొనసాగినదని నిరూపించిరి. ముందేసర్ శాసనము వలన విక్రమాదిత్యుడు ఆరవ శతాబ్దికి పూర్వమువాడు అని స్పష్టమైనందు ఈ సిద్ధాంతముకూడా ఇతరుల అభిప్రాయమువలె వీగిపోయినది. ఈ వాదమున మరికొన్ని అంశముల ప్రసక్తి వచ్చినది. కాని ఆచార్య ఆప్టెగారు టీని వలన ప్రయోజనము లేనట్లు స్పష్ట మొనర్చిరి. ముందేసర్ శాసన కర్త వత్సభట్టి కాళిదాసు భావ ... టినో అనువదించెను. అందువలన కాళిదాసు కాలము క్రీ. శ. 473... మని నిశ్చయింపవచ్చును. అశ్వఘోషుని బుద్ధచరితమునందును ...

భాగములలో కాళిదాసు పోలికలు కనిపించును. కాళిదాసు ప్రతిభాపాండిత్యములం దెవరికిని అనుమానము లేదు. అశ్వఘోషుడు క్రీ.శ. 78 నాటి వాడని స్పష్టముగా తెలిసినది. ఈతడు కాళిదాసు ననుసరించెనని భావించినచో కాళిదాసు క్రీ.శ. 78 కి ముందు జీవించెనని నిర్ణయింపనగును. అభ్యంతర సాక్ష్యములవలనను ఈ అంశము స్పష్టమగుచున్నది. శాకుంతలము నందలి ఆరవ అంకమున ఒకానొక వర్తకుడు మృతినొందిన సన్నివేశ మొకటి కలదు. అతనికి భార్య ఉన్నను ఆతడు వారసహీనుడుగ మరణించెనని వర్ణింపబడినది. ఈ అంశము నాధారముగ గొని ఆచార్య ఆప్టేగారు వితంతువునకు వారసత్వపుహక్కు లేని కాలమున కాళిదాసు జీవించెనని నిర్ణయించెను. ఈ కాలము క్రీస్తు పూర్వమే అగును. మనువు, ఆపస్తంబుడు, వసిష్ఠుల కాల మది. బృహస్పతి శంఖలిఖితులును జీవించి యుండిరి. విక్రమోర్వశీయమున అయిదవ అంకమున నియోగశిల నపహరించి నందులకు మరణశిక్ష విధించబడెను. చౌర్యమను నేరమునకు మనువు, ఆపస్తంబులు మరణశిక్షను నిర్దేశించి యుండిరి. కాని అనంతరదశలో బృహస్పతి తన స్మృతిలో దీనిని శిక్షగ మార్చెను. ఈ ఆధారమువలనను, కాళిదాసు బృహస్పతి కంటె ముందువాడని తెలియును. బృహస్పతి క్రీ. శ. మొదటి శతాబ్దిలో నుండెనని పలువురి మతము.

## ఆచార్య ఆప్టేగారి పరిశోధన:

కాళిదాసు గ్రంథములలో న్యాయతత్త్వపరిభాష ఒకటికూడ లేనందున ఈ తత్త్వ సిద్ధాంతములు విశాలప్రచారముల నొందని దశలో అంతకుముందే కాళిదాసు జీవించియుండునని ఆచార్య ఆప్టే భావించెను. సరళశైలి ప్రాచీన కవుల ప్రధానలక్షణము. కనుక కాళిదాసు క్రీ.శ. ఒకటవ శతాబ్దిలో నుండెనని వారి అభిప్రాయము.

## కాళిదాసు రచనలవలన తెలియు అంశములు:

కాళిదాసు కృతులవలన ఆతడు విప్రుడని తెలియును. శైవుడు కాకపోయినను శివునియందు భక్తి కలవాడు. యాత్రలపై ఆసక్తి అధికము. ఉత్తర

భారతమునందాతడు అన్ని ప్రాంతములందును సంచారమొనర్చి యుండెను. ఈకవి ఒక్కడే కుంకుమ పూవులను సహజ రమణీయముగ వర్ణించెనని డాక్టరు........అభిప్రాయము. కుంకుమపూవు కాశ్మీరములోనిది. హిమాలయ దృశ్యముల నీకవి కన్నులకు కట్టినట్లుగా హృద్యముగను శక్తిమంతముగను చిత్రించెను. మృగయావినోదమునందు కాళిదాసకవికి ఆసక్తి ఎక్కువ. వేట వలన లాభముల నతడొక సందర్భమున సరసముగ వివరించెను. విలాస జీవితముపై ఆసక్తియున్నను కొన్ని అశ్లీలగాథలు ప్రచారముచేసినట్లుగ కాళిదాసు భోగిగాని శృంగారికాని కాడు. ఏభోగియు, శృంగారియు ప్రణయము - నీతిని మహోన్నతరీతిలో చిత్రించలేడు. అది అతనికి కవిష్ఠస్థానము. స్త్రీలనుగూర్చి కాళిదాసు కవికి గౌరవ మధికము. శాకుంతలము ననుసరించి అతడు ప్రేమ, వివాహము గాంధర్వవివాహముల పక్షపాతి అని తోచును. అతని కృతుల వలన కాళిదాసు వేదవిద్యలందు ప్రావీణ్యము గడించెనని తెలియును. ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణములు, సాంఖ్యవేదాంతాదులతో నాతడు సుపరిచితుడు. వైద్యము, జ్యోతిషము మొదలగు శాస్త్రములందును కొంత ప్రవేశముండెను. విశదదృష్టితో పరిశోధనాత్మకముగ పరిశీలించినను ఇంతకు మించి వివరము లాతనిగూర్చి తెలియవు. పైన వివరింపబడిన విశేషములు మాత్రమే రూఢిగ తెలియును. అయినను ఆతనిగూర్చిన అదృశ్య మను తెర తొలగలేదు. అప్పటికి సత్యాన్వేషకులకు కాళిదాసు ఛాయము కవి సోదరుడై ఇట్లు విమర్శించెను.

నేనింతకును ఆదరకు చేరలేదు ఛాయమ్
నావిషయము నంతగా పరిశోధించి అన్వేషించే స్థాయికి.

## కాళిదాసు కృతులు

కాళిదాసు జీవితవిశేషము లెన్నియో అజ్ఞాతములు. సామాన్యకవులు తమకృతుల నాతనిపేర ప్రచార మొనర్చుటకు అవకాశము నొందిరి. ఈ కారణముచేతనే కాళిదాసు రచించిన కృతుల సంఖ్య పెరిగిపోయినది: కాని

విమర్శన మను గీటురాయి వలన విశిష్టమైన దేదియో వెల్లడి యగును. ప్రసిద్ధ పండితులు కొందరు కాళిదాసు 16 కృతులను రచించెనని తెలుపు చున్నారు. కాని నిశితపరిశీలనము వలన వానిలో ఏడుమాత్రమే అతని గ్రంథములని స్పష్టమైనది. 1) ఋతుసంహారము - ఋతువర్ణన ప్రధానమైన కావ్యము 2) కుమారసంభవము - యుద్ధదైవము కార్తికేయుని జన్మోదంతమును వివరించు నట్టిది 3) రఘువంశము - రఘువంశజుల చరితము. 4) మేఘదూతము - వియోగాతిశయమున నొకానొక ప్రియుడు మేఘుని దూతగా పంపిన దూతకావ్యము, 5) శకుంతల - బహుళప్రశస్తినొందిన నాటకము, 6) విక్రమోర్వశీయము 7) మాళవికాగ్నిమిత్రము. వీటిలో మొదటి నాలుగును పద్యకావ్యములు. తరువాతి మూడు దృశ్యకావ్యములు, నాటకములు.

## ప్రాచ్య పాశ్చాత్య దేశములలో కాళిదాసుని కీర్తి

కవిత్వకళకు కాళిదాసు గావించిన సేవ ఎట్టిది? అను అంశమును పరిశీలించినపుడు కాళిదాసు సంస్కృతకవులలో కవిచక్రవర్తిగా గణింపబడిన అంశము మనదృష్టికి వచ్చును. అతని కవితాప్రతిభ భారతీయ కవిత్వమునకు మహోన్నత దశను వైశిష్ట్యమును కలిగించినది. ప్రతివాడు వీతని కవితా చాతురిని ప్రశంసించి హృదయమున నాతనికి గౌరవస్థానము నొసగును. అట్లైనపుడు భారతీయు లీతని వింతగా అభిమానించుటలో ఆశ్చర్యములేదు. విదేశీయ విద్వాంసు లీతని రచనలను చదివి ఆనందించి ఈ అభిప్రాయమునే వ్యక్తీకరించుట గమనింపదగినది. కాళిదాసు ప్రతిభాపాండిత్యములకు జర్మనీదేశపు కవి ఆశ్చర్యచకితుడై ఇట్లనెను -

మాత్నసంవత్సరాగమన మప్పటి మొగ్గలు సంవత్సరాంతము నందలి ఫలములు, ఆత్మకింపును శక్తిని కూర్చు సమస్త పదార్థములు భువియందును దివియందును ఏవి హృద్యములో అవి అన్నియు నొకే నామమున రాశీభూతమై మూర్తీభవించినవి. ఓ శకుంతలా! నీ పేరు ఉచ్చరించినంత మాత్రమున ఇవి

అన్నియు లభించినట్లే అయినది, ప్రసిద్ధయాత్రికుడు తత్త్వవేత్త హెంబోల్ట్ ఇట్లు వ్రాసెను. "ప్రకృతి ప్రేమికులపై ప్రసరింపజేయు ప్రభావమును శకుంతల రచయిత కాళిదాసు హృద్యముగా వర్ణించుటలో ప్రవీణుడు. సువిశాల భావవ్యక్తీకరణము వలన హృదయము నార్ద్రీభూతమొనర్చు భావములలో ప్రతిభలో పరిపూర్ణుడగుట చేతను ఈతనికి ప్రపంచకవులలో సత్యున్నత స్థానము లభించినది. సుప్రసిద్ధ ఆలంకారికుడు ష్లేగల్ కూడ కాళిదాసునకు కవులలో విశిష్టస్థానము నొసగెను. ఆచార్య విల్సన్ భారతీయ కవితాంబర మున జాజ్వల్యమానమగు తార కాళిదాసు అని ప్రశంసించెను. సర్ విలియమ్ జోన్స్ మొదలుకొని మోనియరు విలియమ్స్ వరకు కాళిదాసును భారతీయ షేక్స్పియర్‌గా కీర్తించిరి. ఒక నాటక కర్తకు ఇంతకుమించిన ప్రశస్తి ఏమి? అని వారి అభిప్రాయము.

## కాళిదాసు కవితాప్రతిభ

హోమరు, వర్జిలు, ఫిరదౌసి, షేక్స్పియరు వంటి విశిష్ట కవిశ్రేణిలో కాళిదాసును గణించుట కాతని కవితలో నెట్టి ప్రశస్తి కలదు? అను ప్రశ్న ఉద యించును. సంస్కృతభాషలో ప్రవీణులైనవారే దీనికి సరియైన సమాధానము నొసగ జాలుదురు. ఎవ రేమన్నను ఒకటి మాత్రము నిజము. చిత్రకారుని దృష్టిని, కవి మేధాశక్తిని, శిల్పిహస్తమును పొందియే కాళిదాసు ఈ భూమి యందవతరించెనని ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసు లేకకంఠముగ వచించిరి. ఆతని విశాల విశ్వదృష్టి మానవప్రకృతియొక్క విగూఢమైన రహస్యములనే కాక అనంతసృష్టి లీలావిలాసముల హృద్యరీతుల అంతర్యమును గ్రహించినది. విశాల మైన జ్ఞాపకశక్తి ఆతడు దర్శించిన ప్రతిఅంశమును ఆలోచనాగారమున నిలిపి నది. ఆలోచనాశక్తి దానిని నిత్యనూతన రీతులలో బుద్ధికి అందించినది. అది ఆతని రచనా కౌశలమున రంగరింపబడి రసవంతములైన అలంకారములలో అక్షర రూపము దాల్చినవి. ఒకవిధముగా జూచినచో కాళిదాసకవి దృష్టి కెమేరా, మేధస్సు ప్లేటు, హస్తము ఫోటోగ్రాఫరు, అని చెప్పవచ్చును. ఆతని

ఆలోచనలు భావములు ఉదాత్తములైనవి. హృదయ మార్ద్రీభూతము. ఆనందము దుఃఖము మొదలగు భావములు అన్నియు దానిలో మూసవలె రమణీయ ప్రతిబింబములుగా రూపొందినవి. అవసరము వచ్చినప్పుడు అవి సజీవచిత్రములను గుణములో అందించెడివి. ఇంత ప్రతిభ, ఔన్నత్యము ఉన్నను కాళిదాసు రచనావిధానము, వ్యక్తీకరణపద్ధతి అత్యంత సుకుమారము-లలితము-సరళము. ఈ సారళ్యము హృద్యముగా నుండును. పౌరాణిక కల్పనలకు, శబ్దచమత్కృతులతో పాటు సాహిత్య శాస్త్రకారుల అలంకార మార్గమునకును ఆతడు సుదూరముగ నుండెను. అల్పపదములలో అనల్పార్థశక్తి ఈతని జీవగుణము. ఈతని కృతులలో అలంకారములున్నను అవి సందర్భశుద్ధి కలవి. పునరుక్తి దోషరహితములు. ఉపమలో ఈతడు అందెవేసినచేయి. ప్రతి ఉపమ సందర్భోచితమై మనోజ్ఞమై యుండును. ఈతని శైలి ప్రియమైన గంగానదివలె స్వచ్ఛమై శన్నుల కింపునుగూర్చి గుసగుసలాడుచు, తరంగడోలికలతో మందమందముగా పాగును ఇరువైపుల పచ్చనితీరములపై రంగురంగుల పూలు వికసించి ప్రియురాలివలె హృదయమును సమ్మోహింపజేయును. ఉదాత్తమైన భావములు, కల్పనలలో ఇతరులకంటె విశిష్టుడు కాళిదాసు. ప్రకృతి దృశ్యముల నతిరమణీయముగ చిత్రించును. ఈతని పదములు, శైలి, మున్నగువానిలో అపూర్వమైన మంత్రశక్తి కలదు. తత్ప్రభావమున క్షణకాలము పాఠకుడీ ప్రపంచమును మరచి నూత్నభావనా ప్రపంచములో విహరించును.

## షేక్స్పియరు, భవభూతులు, మీర్ అనీస్‌తో కాళిదాసు తులనాత్మక పరిశీలనము :-

షేక్స్పియరుకవితో కాళిదాసుని పోల్చి చూచినపుడు ఇరువురును ప్రకృతిని సరసముగ పరిశీలించినట్లు, చిత్రించినట్లు తెలియును. షేక్స్పియరు కవిదృష్టి విశాలము కావచ్చును. కాని సంయోగవియోగాది భావములను, మనస్తత్వ రహస్యములను వివరించి తెలుపుటయందు, రమణీయ ప్రకృతిదృశ్యములను శక్తిమంతముగ చిత్రించుటయందు కాళిదాసు షేక్స్పియరును మించినవాడు. సంస్కృతకవులలో కాళిదాసుకు సాటిరాగల కవి భవభూతియే. కాని భవభూతి రచనలో కాళిదాసు సారళ్యము మచ్చునకైనను కనిపించదు. భవ

భూతిది పర్వత శిఖరాగ్రమునుండి దూకు నిర్ఝరివంటిది. అడుగడుగున అది అలంకారము లను రాలుగుండ్లతో ఢీకొనుచు దీర్ఘ జటిల సమాసాలతో కుస్తీలు పట్టి ఉరకలు వేయుచు ప్రవహించును. అతడు ప్రతిభావంతు డనుట కేమా త్రము సందేహము లేదు. ఉదాత్త కల్పనలు ఉత్తేజకరములగు ఆలోచనలలో కాళిదాసు భవభూతిని మించెను. మహోన్నతమైన భావావేశమునందు భవభూతి అనామాన్యుడు. కాళిదాసు ప్రణయభావములను సరసముగ చిత్రించుటలో ప్రవీణుడైనచో భవభూతి వీరకరుణములను పోషించుటలో విశిష్టప్రజ్ఞ కలవాడు. కాళిదాసు వ్యంగ్యము, ధ్వనిని ఆధారముగ గొనును. ఆ భావములనే భవభూతి శక్తిమంతమైన శైలిలో వ్యక్తీకరించుటకు ప్రయత్నించును. ప్రకృతి చిత్రీకరణమున ఒకరినొకరు మించినవారు అని చెప్పుటకు అవకాశములేదు. ఎవరికి వారే సాటి. వీరిలో భేద మిసుమంతయే. కాళిదాసునకు హృద్యమైన దృశ్యము లందు మాత్రమే ఆసక్తి అధికము. భవభూతి వివిధ భావములను సరసముగ కరుణరసాత్మకముగ వ్యక్తీకరించును. కాళిదాసుది విశాలమైన వివరణాత్మక దృష్టి. భవభూతిది తద్భిన్నమైనది.

కాళిదాసును ఉర్దూకవులను తులనాత్మకముగ జూచినపుడు మనదృష్టికి అనీస్‌కవి మాత్రమే నిలుచును. ఈతని కవితలో అదే సారళ్యము శక్తిమంతమైన నుడికారము స్వచ్ఛమైన భావావేశము ఉపమలు మరియు రచనాశక్తి గోచరించును. మానవహృదయమునందలి అగాధరీతులను మరియు ప్రకృతి దృశ్యముల సౌందర్యము నాతడు కాళిదాసువలెనే విశదముగ పరిశీలించి వ్యక్తీకరించెను. మర్సియా రచన లొనర్చినందున అనీస్ ప్రతిభాపాండిత్యము లంతగా రాణించ లేదు. ఇన్ని నిర్బంధములుండియే అనీస్ ఇంతటి రసవత్కవితను సృష్టించెను. స్వేచ్ఛ లభించినచో అతడు ఎంతటి ఉన్నత శిఖరముల నధిరోహించెడివాడో!

## విక్రమోర్వశీయము

ఉదాత్తకల్పనలలో హృద్యములై యొప్పు కాళిదాసు నాటకత్రయమున విక్రమోర్వశీయము రెండవది. ఇది శృంగార ప్రధానమైనది. త్రోటకమను

1) 'విక్రమ' శబ్దము నకర్థము ప్రసిద్ధము. అది క్రియాపదమయినచో బాహుబలముచే అధిపత్యమునొందుట అని అర్థము. విక్రమోర్వశీయమనగా ప్రసిద్ధమయిన పూర్వశి లేదా పూర్వశిని పశమొనర్చుట.'

రూపకభేద మిది. మనోజ్ఞమైన శైలి, మధురమైన భాష, రచనా విధానము మొదలగు వానిని పరిశీలించినపుడు ఇది శాకుంతలముతో సాటివచ్చునని ఇంతకు ముందు విచారింపబడినది. విల్సన్ పండితు డీ నాటకమును గూర్చి యిట్లు వచించెను.

"ఈ రెండు నాటకములకు వస్తువు పురాణములనుండి గ్రహింప బడినది. నాయకులు దివ్యవర్గమునకు నాయికలు, దేవలోక అప్సరసలకు చెందినవారు. మానవాతీతులు. రెండింటియందును భావప్రకటనము హృద్యముగా కనిపించును. సుకుమారమనోజ్ఞమైన భావవ్యక్తీకరణరీతి, ఉదాత్తశైలి రెండునాటకము లందు నొకేరీతిగ నున్నది. ఒకటికంటె ఇంకొకటి మించియున్నదని చెప్పుట కష్టము కాని కాళిదాసు శాకుంతలముకంటె విక్రమోర్వశీయమునం దితివృత్తము సన్నివేశముల కూర్పే ప్రధానముగ గమనింపదగినది. ఒక సన్నివేశమునకు మరియొక సంఘటనకు సంబంధము సహజమని తోచును. ఐనను శకుంతలవంటి మనోజ్ఞమైన పాత్ర ఇందు లేదు. అంతియేకాక భావౌన్నత్యము, రమణీయమైన కల్పనా చమత్కృతి, హృద్యమై సరళమైన వ్యక్తీకరణ విధానము. సహజశైలి, మధురమైన వాణి, మొదలగు గుణము ననుసరించి ఈరెండును సమానములని చెప్పవచ్చును. రెండింటియందును సౌందర్యారాధనము, మానవప్రకృతి చిత్రణ మొకేరీతిగా దోచును. విక్రమోర్వశీయమున ప్రకృతి దృశ్యముల సజీవ చిత్రీకరణము – లోకోక్తులు – మదికారమును సామెతలలో పూర్ణమైన సంభాషణలు బహుళముగ కనిపించును. అవిమల సుందర పుష్పములు కూడ వ్యక్తీకరణ సౌందర్యము వినుమడించునట్టివి. ప్రతి ఉపములో ఏదియో ఒక వైశిష్ట్యము క్రొత్తదనము రమ్యమై సాక్షాత్కరించును. ఒక్కొక్క ఉపమ లోని సొగసును గంటల తరబడి మననము చేసికొనుచు పోయినచో ఎప్పటి కప్పుడు నూత్నవిధమైన అందము కలిగించును. వస్తువుకూడ హృద్యమైనది. చివరివరకు ఆసక్తిని ఔత్సుక్యమును కలిగించును.

## ఇతివృత్త ప్రాధాన్యము :–

ఇక కాళిదాసు ఈ నాటకమునకై వస్తువు నెచటి నుండి గ్రహించెనను అంశము పరిశీలనార్హము. షేక్స్పియరువలె కాళిదాసకవి తన నాటకములకు

వస్తువును స్వయముగ కల్పించలేదు. పురాణములనుండి లేక ప్రాచీనగ్రంథముల నుండి ప్రాచీన గాథలను గ్రహించి అస్థిపంజరమువంటి కథకు రక్త మాంసములు కూర్చి జీవామృతముచే ప్రాణమువోసి రసవంతము చేయుట కాతడు ప్రయత్నించును.

ఈ నాటక కథ ప్రాచీనమైనది. పురూరవుని ప్రసక్తి ఋగ్వేదములో మనువుతోపాటు గావించబడినది. అత డగ్నిదేవునకు స్నేహితుడనియు, ఉదార స్వభావుడనియు, ఆ సందర్భమున వర్ణింపబడినది. మరియొకచోట ఈతనిప్రసక్తి ఊర్వశితోపాటు వచ్చినది. ఆతడు ఊర్వశిని తనతో మరల కలిసికొని సుఖింపుమని కోరినట్లు కలదు. దీనివలన ఊర్వశితో అంతకు ముందొకపారి కలసికొని సుఖించిన అవకాశ మాతనికి లభించినట్లు స్పష్టమగును. మరియొక సందర్భమున పురూరవుని అబ్ధుని పుత్రునిగా దేవతలు పేర్కొనినట్లు కలదు. తనను కామకలచే సంతృప్తినొనర్చినచో తమతో కలిసి స్నేహ భావమున నుండవచ్చునని ఇంద్రభోగముల ననుభవించవచ్చుననియు వచించియుండిరి. వేదములందీ మాత్రమే ప్రసక్తికలదు. కాని అదియు తలతోక లేనివిధముగా అర్థము కాని రీతిలో నున్నది. వివిధ పురాణములలో పురూరవుని కథ నానా విధములుగ నుదాహరింపబడినది. పురూరవునకు మిత్రులతో స్పర్థ జరిగినట్లును, అతడు గంధర్వ నగరమునుండి త్రేతాగ్నులను తెచ్చినట్లును భారతమునగలదు. ఊర్వశితో నతనికి ఆరుపురు పుత్రులు కలిగినట్లును వారిలో ఆయున్ జ్యేష్ఠ డనియు నచట గలదు. కాని ఊర్వశితో వియోగము కలిగిన అంశ మచట లేదు.

## విష్ణుపురాణములోని ఊర్వశిగాథ —

విష్ణుపురాణమునందీ గాథ ఎన్నియో మార్పులు వచ్చినది. ఇంద్రుని సభ లోని అప్సరస ఊర్వశిని స్వర్గభోగము నుండి దూరమగునట్లుగను, మానవు లలో చరించునట్లుగను, మాత్రము శపించినట్లు విష్ణుపురాణమున గలదు. ఊర్వశి అతిలోకసుందరిగా భూలోకమునం దవతరించ చంద్రవంశజుడగు

పురూరవు డామెను జూచి కామించెను. ఊర్వశి ఆతనిని వరించుటకు రెండు నియమములను విధించెను. రెండు పొట్టేళ్ళను తన అధీనమున నుంచుకొని వాని నెక్కడికి పోకుండ జూచుట ఒకటి. ఎప్పుడును దిగంబరుడుగ కనిపించ కూడదనునది రెండవ నియమము. స్వర్గవాసులు ఊర్వశివియోగమున బాధ నొందుచు శాపము పూర్తియైనంతనే ఆమెను మరల దేవలోకమున చేర్చుటకు సంకల్పించిరి. గంధర్వులీ కార్యమున కంగీకరించిరి. ఒకనాటిరాత్రి రాజు గారి శయనమందిరమునకు వచ్చి గొర్రెపోతులను వదలిరి. అవి 'మే మే' అని అరచుటతో రాజునకును ఊర్వశికిని మెలకువ వచ్చినది. గాఢాంధకారము క్రమ్మెనని. ఊర్వశికి కనిపించదను భ్రమలో రాజు వివస్త్రుడై యుండియే వెంటబడెను. గంధర్వు లాక్షణముననే మెరుపును గలిగించిరి. ఊర్వశి రాజును నగ్నస్థితిలో జూచినది. రాజు నియమభంగ మొనర్చెనని ఊర్వశి తత్క్షణమే గంధర్వులతో అదృశ్యమై ఇంద్రునిసభ కేతెంచినది. పురూరవుడు మూర్ఛావస్థ నుండి తేరికొని ఆమెకై విచారించెను. ఊర్వశి వియోగమున తపించి ఏండ్ల కొలది ఆమెకై తిరిగి తిరిగి ఒకసారి కురుక్షేత్రము నందొక సరోవరము చేరెను. అచ్చట ఊర్వశి ఇతర అప్సరసలతో చెలికత్తెలతో సంచరించుచుండెను. రాజు ఊర్వశిని గుర్తించి తనవెంట రమ్మని ఎంతయో బలవంతము చేసెను. ఆమె అందుల కంగీకరించలేదు. రాజ్యవ్యవహారములం దనాసక్తుడై పరిభ్రమించనిచో సంవత్సరమున కొకసారి మాత్రము వచ్చి ఆతనితో నుండుటకు సమ్మతించెను. ఇట్లు ఏడాదికి ఒకసారి రాకపోక లొనర్చి పురూరవునితో కాపుర మొనర్చగా వారికి ఆరుగురు పుత్రులు గలిగిరి. పెద్దవాడు ఆయుష్- పురూరవు డామె వియోగమున మాత్రము విచలిత మనస్కుడై యుండెను. గంధర్వు లాతని స్థితినిజూచి దయదాల్చి ఒక అగ్నిపేటిక నిచ్చిరి. అందు అగ్ని ప్రజ్వరిల్లు చుండెను. అభీష్టముల నెరవేర్చు యజ్ఞము చేయుట కది తోడ్పడుననిరి. దాని నాతడొక పొదలో నుంచి ఊర్వశికై అన్వేషించుచు అరణ్యములోనికి వెళ్ళెను. కాని ఆమె కనిపించలేదు. తిరిగి వచ్చి చూచుసరికి అచట అగ్నిపేటికకు బదులు రెండు చెట్లను చూచెను. ఒకటి శమీవృక్షము-రెండవది అశ్వత్థము. పురూరవుడు

రెండు చెట్లనుండి ఒక్కొక్క కొమ్మను తెంచి తెచ్చి అరణిగా చేసి రాజ ప్రాసాదమునకు వచ్చి ఆ రెండింటిని రాపిడి చేయ నందుండి అగ్ని పుట్టెను. దానితో వాడు ఎన్నియో హోమము లొనర్చి గంధర్వపదవి నందుకొనెను. దేవ లోకమున ప్రియురాలి సహవాసము లభించెను. భారతదేశమున అగ్ని ఆరాధన మారంభించినవాడు పురూరవు డను అంశము ఈ గాథ వలన స్పష్టమగుచున్న దని విల్సన్ పండితుడు భావించెను.

## బృహత్కథలోని గాథ

ఊర్వశీ పురూరవుల ప్రణయగాథ బృహత్కథయందును గలదు. పురాణములలోని కథకును నాటకమునందలి వస్తువునకును దానితో నెట్టి సంబంధము లేదు. పురూరవుడు విష్ణుభక్తుడు ఇంద్రుని నందనవనములో విహ రించు సందర్భమునం దాతనికి ఊర్వశి కనిపించినది. ప్రథమదర్శనముననే వారికి ప్రణయ మంకురించినది. విష్ణువు ఈ సంగతి తెలిసికొని ఊర్వశిని పురూరవున కొసగవలసినదని ఇంద్రునకు నారదునిద్వారా కబురంపెను. ఇంద్రు డట్లే చేసెను. ఊర్వశీపురూరవు లిరువురు సుఖముగ నుండిరి. దేవ లోకమునం దొకసారి జరిగిన యుద్ధములో దేవతలకు పురూరవుని బాహుబల సహాయముననే జయము లభించినది. ఇంద్రుని సభయం దీ విజయమువల్ల ఆనందోత్సాహములు వైభవముగ జరిగినవి. అప్సరసల గురువు అగు తుంబు రుని ఆధ్వర్యమున రంభ నృత్య మొనర్చినది. నాట్యముచేయుతరి రంభ అడుగు తప్పుటచూచి పురూరవుడు నవ్వెను. తుంబురున కది దుస్సహమైనది. విష్ణువు అనుగ్రహము నొందునంతవరకు ఊర్వశితో వియోగము ననుభవింపు మని ఆతడు పురూరవుని శపించెను. పురూరవునకు మూర్ఛనుండి తెలివి వచ్చులోపల గంధర్వు లూర్వశిని తీసికొని వెళ్ళిరి. పురూరవుడు ఖిన్నుడై తపమొనర్చి నారాయణుని అనుగ్రహము నొందుటకై బదరీనాథ్ వెళ్ళెను. విష్ణువు సంప్రీతుడై పురూరవుని కోరికను మన్నించెను. అతనికి ఊర్వశి లభించినది.

## మత్స్యపురాణగాథ

మత్స్యపురాణములోని గాథలో కాళిదాసు నాటకకథ చాలవరకు పోలి యున్నది. సోమునకు తారవలన జన్మించినవాడు బుధుడు. సోము డాతనికి విశ్వముపై ఆధిపత్యము నొసగెను. బుధునకు "ఇల" వలన కలిగిన కుమారుడు నూట ఇరువది అశ్వమేధ యజ్ఞము లొనర్చెను. ఈతడే పురూరవుడు. హిమాలయ శిఖరములం దాతడు విష్ణుపూజ లొనర్చుచుండెను. భూలోకము నందలి ఏడుగురు పురూరవుల కాతడధిపతి అయ్యెను. కేశి మొదలగు దైత్యులను సంహరించెను. ఊర్వశి ఈతని సౌందర్యమున కాకర్షితయై పరిణయ మాడెను.

ఒకనాడు సద్వర్తనము, ధనము, ఇంద్రియసుఖములు అనువారు ముగ్గురును కలసి పురూరవునివద్దకు వచ్చి ఆతనిదృష్టిలో తమలో ఎవరు గొప్ప అనునది తెలిసికొన జూచిరి. పురూరవుడు వీరినందరిని ఆదరించి గౌరవించెను. సద్వర్తనమున కాత దధిక గౌరవము నొసగెను. అది ధనము ఇంద్రియసుఖము లకు కోపావేశములు గలిగించినది. ఆతడు దురాశ వలన భ్రష్టుడగుగాక అని ధనము శపించెను. ప్రియురాలితో వియోగమునొంది కుమారవనములోని గంధమాదనపర్వతమున తలగొట్టుకొనుచు తిరుగుమని ఇంద్రియ సుఖముకూడ శపించినది. కాని సద్వర్తనము మాత్రము సత్ప్రవర్తనతో దీర్ఘఆయురారోగ్యముల నొందునట్లుగను. ఆచంద్రార్కముగ నాతని పతీపతులు సుఖించునట్లుగను విశ్వముపై ఆధిపత్యము నొందునట్లుగను అనుగ్రహించెను. అనంతర మీ ముగ్గురును అదృశ్యము నొందిరి. పురూరవునకు ప్రతిదినము ఇంద్రుని దర్శనమున కేగుట పరిపాటి. ఒకనాడు రథారూఢుడై సూర్యునితోపాటు దక్షిణాయనమున సంచరించుచుండ కేశి దైత్యుడు అప్సరసలగు చిత్రలేఖమరియు ఊర్వశిని పట్టుకొని వెళ్ళుచున్నట్లు చూచెను. పురూరవుడు తక్షణమే వాయుబాణము వేసి అతనిని సంహరించెను. అప్సరోభామినులను రాక్షసుల క్రూరహస్తములనుండి కాపాడుటయేకాక కేశి హస్తములతో చిన్నాభిన్నమైన సింహాసనముపై ఇంద్రుడు స్థిరముగా నుండునట్లు తోడ్పడెను. సాహసోపేతములైన ఈ కార్య

ములకు ఇంద్రుడు సంతుష్టాంత రంగుడై పురూరవునితో స్నేహ మొనర్చెను. పురూరవుని ఆధిపత్యము, భుజబలము, భోగైశ్వర్యము లితోధికముగ పెంపొందునట్లు ఇంద్రు డనుగ్రహించెను.

ఒకనాడు నాటకోత్సవ సందర్భమున ఇంద్రుడు పురూరవు నాహ్వానించెను. లక్ష్మికి భర్త నెన్నుకొను గాథ దీనిలో ప్రదర్శింపబడ నుండెను. భరతుని కృతమగు రూపక మిది. ఊర్వశి, మేనక, రంభలు దీనిలో పాల్గొనుట కాదేశింపబడిరి. ఊర్వశి లక్ష్మిపాత్ర ధరించెను. కాని రాజు చూచినంతనే మైమరచి రంగస్థలముపై తానేమి చేయవలయునను అంశమే మరచిపోయెను భరతుడీ సన్నివేశమునకు కుపితుడయ్యెను. రాజుతో వియోగము నొందునట్లుగను, 55 ఏండ్లవరకు ద్రాక్షతీగయై యుండునట్లుగను శపించెను. రాజు పిరంతరము విచారించిన తరువాత మరల ఆమె యథాస్థితి నొందున ట్లనుగ్రహించెను. ఊర్వశి రాజును పరిణయమాడి నియతకాలమువరకు వియోగము నొందినది. తదనంతర మామెకు ఎనమండుగురు పుత్రు లుదయించిరి. వారు మానవాతీతమైన శక్తిసమన్వితులు. ఆయువు వారిలో అగ్రజుడు.

## మూలకథలో కాళిదాసుచేసిన మార్పులు

ఈ అంశములను పరిశీలించినచో ఈ కథ పురాతనమైన దనియు, కాళిదాసు కాలము నాటికి అతిప్రసిద్ధమై యుండెననియు స్పష్టమగును. శుష్కమైన కథాశరీరమునకు కాళిదాసు ప్రాణముపోసి నూత్నతేజమును ప్రసాదించినందున శాశ్వతకీర్తి లభించినది.

మూలకథాస్వరూపము నట్లే యుంచినను తన ప్రతిభావ్యుత్పన్నతచేత, శిల్పకళాదృష్టిచేత, సిద్ధహస్తుడగు చిత్రకారునివలె కాళిదాసు అక్కడక్కడ కుంచియతిప్పి హృద్యములైన వర్ణములనుకూర్చి దానిని స్వర్గమువలె సుందరముగ తీర్చిదిద్దినాడు. ఈ అంశములందే అతని నైపుణి వ్యక్తమగును. పురూరవుని వివాహము కాశీరాజు దుహితయగు పద్మజతో జరిగినట్లు విష్ణుపురాణము

నందును లేదు. కాని కాళిదాసు ఈ కల్పనకు క్రొత్త యూపిరినిచ్చి ద్వితీయ, తృతీయాంకమున ఒకవిధమైన ఔత్సుక్యమును కలిగించెను. భారతనారీ హృదయమును వారి స్వచ్ఛమైన ప్రణయము, అనురాగము, అనునయము, ఆలుక మొదలగు అంశములను రమణీయముగ చిత్రించెను. భరతుని శాప ప్రభావము, ఇంద్రుని అనుగ్రహముచే తొలగింపచేసి ప్రేయసీప్రియుల సమాగమమునకు మార్గమును సుగమ మొనర్చెను. చివరకు అన్నియు సమకూడినవి కాని విచార మేఘము లావరించినవి. ఏదియో తీరనిబాధవలన ఆశవలన అందరును ఒకరి ముఖము నొకరు చూసికొనుచుండిరి. ఈ దశలో అకస్మాత్తుగ నారదుని ఆగమనము, ఇంద్రుని ఆజ్ఞను వినిపించుట క్షణములో విషాదపూరిత వాతావరణము కల్యాణోత్సవముగ మారుట అను సన్నివేశములు కాళిదాసుని కల్పనావైభవమును దర్శింపజేయును. నాయికా నాయకులు. కొన్ని సన్నివేశములు తప్ప ఇతరాంశము లన్నియు కాళిదాసు ఉదాత్తమైన ఆలోచనాత్మక మైన కల్పనలే. ఊర్వశీప్రణయరీతులు, స్వచ్ఛమైన ప్రేమ, చిత్రలేఖ అభిమానము, అనురాగము, ఊర్వశితో విదూషకు డొనర్చిన పరిహాసము, అతడు ప్రతి అంశమునందును భోజనప్రియత్వమునే వ్యక్తమొనర్చుట, నిపుణిక చతుర సంభాషణము రాణిగారి రాజనీతి, గౌరవము, అభిమాన దర్పము, పురూరవుని సాహస పరాక్రమము. దేవతల విధేయత, చివరికి పుత్రదర్శనముతో పంచలితులగుట మొదలగునవి అన్నియు ఈతని కల్పనలే.

## సన్నివేశ చిత్రణములు

ఊర్వశి దృష్టి పురూరవునిపై పడినపుడు రాక్షసులకు కృతజ్ఞులు కావలసి వచ్చినదని వచించుట, తనహృదయములోని భావమును వ్యక్తీకరించుట–చిత్ర లేఖముఖమున రాజుతో సెలవు పుచ్చుకొనుట–చిత్రరథునికి సమాధానముగ పురూరవుడు తనకు విజయ చంద్రుని మూలమున జరిగినదనిచెప్పుట–రాణి నిపుణికతో ఊర్వశి ప్రణయలేఖను ప్రస్తావించి దానిని మొదట చదివి అందు విశేషమేమియు లేనిచో తనకు చదివి వినిపించుమనుట – ఊర్వశి

అదృశ్యయై సమీపమున నున్నపుడే రాజు ఆమెను పేరెత్తి పిలుచుట - అతని కోరిక నెరవేరుగాక అని తక్షణమే సమాధాన మొసగుట - ఆయువును యువ రాజుగ పట్టాభిషిక్తుని గావించిన అనంతర మాతని రాణి దగ్గరికి వందన మాచ రించుటకు తీసికొనిపోవుట - ఇవి అన్నియు కాళిదాసు గావించిన లలిత సన్ని వేశముల చిత్రణమును నిరూపించును.

ఈతని భావనాశక్తి రసవంతమైన సన్నివేశ చిత్రణమున ప్రత్యక్ష మగును. నాటక ఆరంభమునందే హృద్యమైన దృశ్యమును చిత్రించెను. అప్స రసలు తమ సఖి బంధిత యైనపుడు విందించిన సన్నివేశమిది. పురూరవుడు రథము నధిరోహించి సూర్యుని ఆరాధించి తిరిగివచ్చుట-రక్కసు నెదుర్కొని సఖిని వారితో కలుపుట ఈఅంశములు కథకు బీజప్రాయమైనవి. కంఠహారమున చిక్కులు పడిన నెపమున చివరిచూపునకై ఊర్వశి క్షణకాల మాగుట. తదనం తర ముద్యానవనమునకు వచ్చి కలిసికొనిన అనంతర క్షణమే తిరిగివచ్చుట, ఊర్వశి లేఖ రాణి చేతబడుట, రాణిదానికై అన్వేషించు సమయమునకే అచటికి వచ్చుట, ఊర్వశి అదృశ్యయై నిలచియుండుట గాజులగలగల వినబడినను, వెనుకనుండి వచ్చి కనులు మూసినను బాగుండెడిది అని రాజు తపించుట, ఊర్వశి అల్లేచే, రాజు వియోగమున కలవరమునొంది పిచ్చిగా అడవులలో తిరుగుట, తనప్రియురాలి నన్వేషించుచు చేతనాచేతనముల సహాయము అర్థిం చుట, చివరికి లతనాలింగనము చేసికొనుసరికి ఊర్వశి వెలువడుట, ఆయువు దర్బారునకు వచ్చుట - నారదుడు సుదీర్ఘకాల వియోగములో అంతర్యమును వివరించి అందరి మనోవ్యథను ఆందోళనను తొలగించుట — ఇవి అన్నియు రసవంతముగ సజీవముగ చిత్రింపబడు సన్నివేశములు.

ఈ నాటకమునందలి ప్రథమ చతుర్థాంకములు విశిష్టమైనవి అని చెప్ప వచ్చును. చతుర్థాంకమున రాజుపొందిన కలవరము కరుణరసాత్మకముగ చిత్రింపబడినది. పాఠకుని హృదయ మార్ద్రీభూతమై అతని దుఃఖమును పాలుపంచుకొని సఫలుడగుటకు ప్రార్థించునంతటి శక్తిమంతమైన సన్నివేశమిది.

## కొన్ని ఆక్షేపములకు సమాధానములు

ద్వితీయతృతీయాంకములను పరిశీలించి శ్రీ కాలేగారు అవి నాటకములో సరియైన తీరులో సంధానమొందలేదనియు, అవి వస్తుపోషణమున కేమాత్రము తోడ్పడుటలేదనియు నభిప్రాయపడిరి. ఆహ్లాదకరమును, క్లిష్టమునైన కథలనే ప్రదర్శించుట నాటకముల ప్రధాన ప్రయోజనముకాదు. మానవులకు వారి కథనే రమ్యముగ దర్శింపజేయుటయే ప్రధానలక్ష్యము. ఈదృష్టితో నీ అంకములను పరిశీలించినపుడు నాటకమునందలి ప్రధానరసము శృంగారమని స్పష్టమగును. ఈ రెండు అంకములలోను ప్రణయమునకు సంబంధించిన మొదటి దశలలోని బాధలు, శక్తిమంతముగా దర్శించబడినవి. రెండవఅంకమున రాజు సహనశీలి అనియు దైనందిన వ్యవహారమునుండి విముఖుడనియు తెలియును. విశ్రాంతి సమయమంతయు అశాంతితో గడచినది. మనసు దేవియందును లగ్నముకాదు. ప్రాసాద మతనికి కంటక ప్రాయమైనది. ఉద్యానవనమునందలి సౌరభము, మలయమారుతము, పరవశముచేయు దృశ్యములకై అతని హృదయము తపించును. ప్రేయసీప్రియుల సమాగమము కలిసినంతనే వియోగమునొందుట, అనురాగ పోషణమునకు తోడ్పడును. ఉత్తమ స్త్రీలకు భర్తలను గూర్చి ఎంతటి పవిత్ర అనురాగాతిశయము౦డునో రాణిపాత్ర ముఖమున సూచించెను. భర్తలస్థితి వారికంటె భిన్నమైనది. మనోజసౌందర్యమును జూచిన వారి పరిస్థితి మారిపోవును. భార్యపైగల స్వల్పానురాగము అనునయము, పై పై మెరుగులై అన్వేషించినను కనపడని రీతిలో నుండును. ఈ రంగస్థలముపై వచ్చు సన్నివేశము, ఇతివృత్తమున కేమాత్రము పోషకముగా లేదని అది అనవసరమని కొందరు తీవ్రముగ విమర్శించిరి. దీనికి సమాధానమిట్లు చెప్పవచ్చును. ఈ నాటకమునందలి నాయిక అప్సరోజాతికి చెందినది. స్వర్గలోకమున వారిస్థితి భూలోకమునందలి వేశ్యలవంటిది.

తన కులమునందలి ధర్మము ననుసరించి హృదయగత భావములను వ్యక్తీకరించుటలో వెనుకంజ వేయని రీతిలో ఊర్వశిని తనకై అన్యులను

తపింపజేయుట ఆమెయే వలచినట్లు అనురాగ పారవశ్యమున పేరోగలమున తన ప్రియుని నామము నుచ్చరించినట్లు, వియోగభరమును వహించుటలో సందేహించినట్లు చిత్రించినచో, కులస్త్రీలకు భూషణములగు అమాయకత, లజ్జ, సిగ్గు, సహనము, మొదలగు గుణముల కామద రూపమున నున్నట్లు చిత్రించినచో అదికేవలము దృశ్యముయొక్క ఒక పాక్షిక చిత్రణమే అగును అదియునను కరణీయము. అందులకే కాళిదాసు రాణిని రంగస్థలముపై ప్రవేశింపజేసి కులస్త్రీల సహజగుణములను, అభిమానము, లజ్జ, సహనశీలత మొదలగు వానిని చిత్రించినాడు. వస్తువుననుసరించి చూచినను, ఈ రెండు అంకముల ఫలాగమమున కెంతయో దోహద మొనర్చుచున్నవి. దీనివలననే అనురాగ వృక్షమున కంకురము లేర్పడి కుసుమ ములావిర్భవించును. ఇక వ్యక్తీకరణ విధానమో! భావములు, కల్పనలు, మేఘములవలె ఆవరించుచు వచ్చును. ఉపమల విద్యుల్లత అకస్మాత్తుగ ప్రకాశించి క్షణములో మబ్బుతెరలను తొలగించి వాతావరణమును ప్రకాశవంత మొనర్చును.

## ఆచార్య విల్సన్ అభిప్రాయము

విక్రమోర్వశీయ నాటకమునుగూర్చి ఆచార్య విల్సన్ వ్యక్తీకరించిన అభిప్రాయము గణింపదగినది.

"ఈ నాటకమునందలి పాత్రలు, సన్నివేశములు ఒకానొక దివ్యశక్తికి అధీనములై యున్నవి. మధ్య మధ్య దాని ప్రమేయమువలన నాటకమున కొక విధమైన ప్రాశస్త్యము లభించినది, విధి ప్రభావము ప్రతిరంగమున కనిపించును. రాజు, అప్సరస, అప్సరసలకు రాజు, దేవతల కధిపతియగు ఇంద్రుడు అందరును దాని అనివార్యమైన కఠినమైన ఆనతికి తలవంచినవారే. ఉదాత్తమైన కవితారీతి ఈ నాటకమున మరియొక వైశిష్ట్యము. ఇతివృత్తము దృశ్యము పాత్రలు అన్నియు ఉదాత్తకల్పనలకు ప్రతీకలు. రమణీయమైన భావములలో నొకటిని మరియొకటి యున్నది. వానియందొకదానిని మాత్రమే తర్కాణముగ

నుదాహరించుట వేరొకదానికి అన్యాయము చేసినట్లగును కనుక ఈ నిర్ణయము సహృదయుల అభిరుచికి, పాఠకుల నిశిత పరిశీలనా శక్తికి వదలుటయే శ్రేయస్కరముగ దోచును."

ఈ భావమును దృష్టియం దుంచుకొనియే నేనుకూడ వివిధాశయములను విపులముగ వివరించుటకు సందేహించుచున్నాను.

## అనుదవామున కలిగిన శ్రమ:

విక్రమోర్వశీయమునకు పాశ్చాత్య భాషలలో ఎన్నియో అనువాదములు వెలువడినవి. వీనియందు ఆంగ్లానువాదములు మూడు, జర్మనీ అనువాదమొకటి గణింపదగినది.

ఆంగ్లానువాదములలో విల్సన్‌గారిది ఆద్యమైనది. ఇది పద్యరూపమున గలదు. ఈ అనువాదము మూలానుసారిగ సాగినది. విశిష్టమైనదేగాని పద్యరూపమున నున్నందున ఛందస్సునకనుగుణమైన రీతిలో కొన్నిసందర్భములలో భావము విస్తృత పరచుటయో స్వల్పముగ మార్చుటయో జరిగినది. ఈ కారణముచే నిది కాళిదాసులోని కళాత్మక సౌందర్యమును సరసముగ దర్శింప జేయుట కశక్తమయి యున్నది. విక్రమోర్వశీయము బొంబాయి విశ్వవిద్యాలయములో పాఠ్యప్రణాళికతో చేర్చబడిన గ్రంథము. కనుక మనలోని ప్రసిద్ధ విద్వాంసులు దీనినిగూర్చి శ్రద్ధచూపిరి. విద్యార్థుల ఉపయోగార్థము దీని ప్రతి పదానువాదము గూడ ప్రకటించిరి. వీనిలో మో. కాలే. మరియు వైద్యగారి అనువాదములు ప్రకటింపబడినవి. కాని ఈ అనువాదములలో వ్యక్తీకరణశిల్పము రామణీయకము లోపించినది. శ్రీ ఎస్. బి. పండితుడు విక్రమోర్వశీయమును గూర్చి కొన్ని అంశములు వ్యాఖ్యారూపమున వెలువరించినారు. నేను సంస్కృత భాషను చదువగలను మాత్రమే. దురదృష్టవశమున నేను నివసించుప్రదేశమున బీద్‌లో సంస్కృతము తెలిసిన విద్వాంసులు పండితులు లేరు. అందువలన ఆంగ్లానువాదములపై ఆధారపడక తప్పలేదు. వీనితో సంస్కృత మూలమును

తులనాత్మకముగ వీలైనంతవరకు పరిశీలించితిని. నాకు మరాఠీభాషలో స్వల్ప పరిచయమున్నందున మరాఠీ అనువాదము సహాయము నొందుటకు ప్రయత్నించితిని. కాని మరాఠీ అనువాదకులు అతిచిత్రమయినవారు. వారిదృష్టిలో కాళిదాసుకు నాటకరచన మన నేమియో తెలియదు. వారు తమ అనువాదములకు పీఠికలో ఇట్లు స్పష్టముగ వ్రాసినారు.

కాళిదాసు విక్రమోర్వశీయమును పఠించుట కాసక్తి గలిగించుటకెన్నియో మార్పులు చేయవలసిన అవసరము కలిగినది. వీరి ప్రయత్నము వివిధాంశముల కూర్పు విక్రమోర్వశీయమును మరింత జటిల మొనర్చినది.

సిద్ధహస్తుడైన కవీశ్వరుడు విక్రమోర్వశీయము ననువదించుటకు పూనుకొనినపుడు కాళిదాసు సర్వతోముఖ వైదుష్యము వెల్లడి యగును. కాని మన కవులు ఇటువంటి కార్యమనిన ఆమడ దూరము పోవుదురు. ఇతరులు కూడ దీని అనువాదమును గూర్చి శ్రద్ధవహించినట్లు లేదు. ఇటువంటి పనులకు నేను తగనివాడనని తెలిసియు దేశసేవ దృష్టితో సాహసించి శక్త్యనుసారము ప్రయత్నించి ఎటులనో పూర్తిగావించితిని.

భారతీయదృక్పథము గూర్చియు, సంస్కృతపురాణ గాథలను గూర్చి సామాన్యముగ ప్రజలకు పరిచయము స్వల్పము కనుక సందర్భానుసారముగ భావము స్పష్టముగ దెలియుటకు కొన్ని వివరములుకూడ వ్రాసినాను.

నేను నాకు ఓపిక, శక్తి ఉన్నంతమేరకు పరిశ్రమచేయుటలో వెనుదీయలేదు. కాళిదాసు భావవైశిష్ట్యమును ఉర్దూ భాషీయులకు సరసరీతిలో స్పష్టమొనర్చుటకు శక్తికొలది ప్రయత్నించినాను. ఈ కృషి సఫలముకానిచో అది నా అసామర్థ్యముగ భావింపదగును.

బీద్ దుర్గము, — బుధజన విధేయుడు,

1-5-1905. — మహమ్మద్ అజీజ్ మిర్జా.